Tahreek-e-Islami Mein
Karkoonon ke Bahami Talluqath
(Telugu)

# ఇస్లామీయ ఉద్యమం కార్యకర్తల సంబంధాలు

*రచయిత :*

**ఖుర్రం మురాద్**

*అనువాదం :*

**గౌసుర్రహ్మాన్**

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# మా మాట

సర్వ సృష్టికర్త అయిన అల్లాహ్‌కు సహస్రకోటి ధన్యవాదాలు. ఆయన కరుణానుగ్రహాల వల్లనే ఈ పుస్తకం ప్రచురణకు నోచుకుంది.

కార్యకర్తల మధ్య సత్సంబంధాల గురించి ఒక్కొక్క అంశం ఎన్నుకొని విపులీకరించడం జరిగింది. ఇస్లామీయ ఉద్యమానికి సంబంధించిన ప్రతి సభ్యుడు, కార్యకర్త, సానుభూతిపరుడు తప్పక చదువవలసిన పుస్తకం ఇది. అందువల్ల తెలుగు తెలిసిన ముస్లిం సోదరుల కోసం, ప్రత్యేకించి ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తల గురించి ఇందులో కావలసినంత సరంజామ ఉంది. దీనిద్వారా వారు ప్రయోజనం పొందాలని కాంక్షిస్తున్నాం.

ప్రముఖ ఇస్లామీయ విద్వాంసులు ఖుర్రం మురాద్ గారి పుస్తకం "తహ్‌రీకె ఇస్లామీ మే కార్కునోఁకే బాహమి తాల్లుఖాత్" పేరుతో 1967లో ప్రథమంగా ఉర్దూలో ప్రచురించబడింది. ఇప్పటి వరకు అనేకసార్లు ప్రచురించబడుతూ ఇస్లామీయ ఉద్యమంలో వారధిగా నిలిచింది. ఆంధ్రప్రదేశ్ ఉద్యమ కార్యకర్తలకు ఇది స్ఫూర్తినిస్తుందని ఆశిస్తున్నాము.

– ప్రకాశకులు

# విషయ సూచిక

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# ఇస్లామీయ ఉద్యమంలో కార్యకర్తల మధ్య సత్సంబంధాలు

ఇస్లామీయ ఉద్యమం ఒక సామూహిక మార్పు (విప్లవం)ను ఆహ్వానిస్తుంది. అందువల్ల ఉద్యమ కార్యకర్తలు సామాన్య ప్రజలతో సత్సంబంధాలు నెలకొల్పుకోవడం చాలా అవసరం. ముఖ్యంగా కార్యకర్తల మధ్య సరైన ప్రాతిపదికపై ప్రత్యేక సంబంధాలు ఏర్పరచుకోవడం ఉద్యమ కార్యకర్తల ప్రథమ బాధ్యత. ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తల మధ్య సత్సంబంధాలను గురించి దివ్య ఖుర్‌ఆన్ క్రింది విధంగా ప్రకటించింది.

"విశ్వాసులు పరస్పరం సోదరులు." (అల్ హుజురాత్ : 10)

చూడడానికి ఈ వాక్యం మూడు చిన్న పదాల కూడికగానే కనబడుతున్నప్పటికీ వాస్తవానికి సత్సంబంధాల పునాదులు, నియమ నిబంధనల ప్రాముఖ్యత వెల్లడించటానికి ఇది సరిపోతుంది. నిజానికి దీనిని ఇస్లామీయ ఉద్యమ చార్టర్‌గా పరిగణించవచ్చు.

దీనిద్వారా ఇస్లామీయ ఉద్యమంలో కార్యకర్తల మధ్య సత్సంబంధాలనేవి తప్పనిసరిగా ఉండవలసిన మౌలిక సంబంధాలని స్పష్టమవుతోంది. ఈ సంబంధాలు విశ్వాసం, ఆలోచనల సమైక్య పునాదులపై ఏర్పడతాయి. ధ్యేయంలో సారూప్యం దీనికి ముఖ్య ఆధారం. అందరిలోను విశ్వాసం ఉమ్మడిగా ఉంటుంది. సంబంధాలు ఉద్యమానికి మౌలిక అవసరం కాబట్టి ఇందులో పటిష్ఠత, దృఢత్వం, వాటితో పాటు ప్రేమానురాగాలు సమ్మిళతమై ఉండాలి. ఇద్దరు అన్నదమ్ముల అనుబంధమే దీనికి నిలువెత్తు నిదర్శనం. ఇదే సౌభ్రాతృత్వం, సోదరభావం అనబడుతుంది. సూత్రప్రాయమైన ఒక అనుబంధాన్ని మరింత పటిష్ఠం చేయటానికి ఇస్లాం 'సౌభ్రాత్రం' (Fraternity, Brotherhood) అనే అపురూపమైన భావనను ఏర్పరచింది.

ఇస్లామీయ సంస్కృతిలో ఈమాన్ (విశ్వాసం) అంటే మానవుడు కేవలం కొన్ని అగోచర అభౌతిక విషయాల వాస్తవికతను అంగీకరించి ఉండిపోవడం మాత్రమే కాదు. నిజానికి ఈమాన్ (విశ్వాసం) సర్వతోముఖమైన స్థాయిని కలిగి ఉంది. ఇది హృదయంలో నాటుకుపోయే విశ్వాసం! నరనరాల్లో రక్తంలా ప్రవహించే విశ్వాసం! ఇది హృదయాన్ని ఎల్లప్పుడూ స్పందింపజేసే భావావేశం! ఇది మనో మస్తిష్కాలను మార్చివేసే ఒక దృక్పథం. ఇది ఒక ఆచరణాత్మక వ్యవస్థను స్థాపించే శక్తి. సమస్త అంశాలను అదుపాజ్ఞలలో ఉంచుతూ మనిషి వ్యక్తిగత, సామూహిక జీవితంలో విప్లవాన్ని కలుగజేస్తుంది.

ఇలాంటి ప్రభావవంతమైన విశ్వాసం పరిధిలో మానవుల మధ్య సత్సంబంధాలు ఉండకపోవడం ఎలా జరుగుతుంది? మనిషి పూర్తి జీవితం అవిభాజ్యమైన ఏకాంకం. అది సత్సంబంధాలపైనే ఆధారపడి ఉంటుంది. అందువల్ల ఇస్లామ్ మానవాళిని ఉద్దేశిస్తూ సత్సంబంధాలు నెలకొల్పాలని ముఖ్యంగా వ్యక్తిగత సత్సంబంధాలు అవసరమని సూచిస్తుంది. అది ఈ సంబంధాలను - న్యాయం, ఉపకారం పునాదులపై నెలకొల్పడానికి ఒక సామూహిక జీవిత విధానాన్ని, ఒక సంస్కృతిని రూపొందించింది. ఇంకొకవైపు హక్కులు బాధ్యతలను స్పష్టీకరిస్తోంది. దీనివల్ల ప్రతి వ్యక్తి తన వ్యక్తిగత స్థాయిలో దీనిని ఆచరణలో పెట్టగలడు. ఈ విధంగా ఈ విశ్వాస సంబంధాలు కలిగి ఉన్నవారు పరస్పరం ఒక చేతి వ్రేళ్లు ఇంకొక చేతి వ్రేళ్లు పైన వేసుకొన్నట్లు లేదా ఒక సోదరుడు తన సోదరునితో ఉండేవిధంగా కలివిడిగా ఉండాలి. మానవ నైజం వాంఛించే వివేకవంతమైన ఈ సంబంధాలు విశ్వాసానికి అత్యంత అవసరం.

సమస్తాన్ని త్యజించి దైవానికే అర్పితమైన వాళ్ళు, అన్ని రకాల విధేయతలను పరిత్యజించి కేవలం అల్లాహ్ విధేయతను స్వీకరించిన వారు, అన్ని రకాల మిథ్యా దైవాలను విడిచిపెట్టి కేవలం సత్యాన్ని ఆచరించేవారు కేవలం అల్లాహ్ కొరకు అంకితం అయిపోయిన వారు పరస్పరం సత్సంబంధాలు ఏర్పరచుకోకపోతే, ప్రేమానురాగాల అనుబంధాలు ఏర్పరచుకొనకపోతే, ఇక ఈ పనిని ఎవరు చేస్తారు? ఆశయాన్ని సాధించాలన్న ఏకాగ్రతకు మించి ఏ బలవత్తర విషయం మానవులను ఏకం చేస్తుంది? ఈ ఏకాగ్రతకు సంబంధించిన ప్రతి అవసరమూ, సత్యమార్గాన

ఎదురయ్యే ప్రతి మజిలి ఈ సంబంధాన్ని ఒక సజీవ సత్యంగా మార్చుతుంది. తనను తాను సత్యధర్మానికి సమర్పించుకున్న వ్యక్తి ఇదే మార్గాన ప్రయాణిస్తున్న వారి నుంచి ప్రేమ, సానుభూతి, ఓదార్పు, సహాయ సహకారాలు పొందగోరుతాడు. ఒకవేళ ఈ మార్గంలో వీటిని అతడు పొందకపోతే ఈ లోటు పూరించలేనిది.

ఈ ప్రపంచంలో ఈమాన్ (విశ్వాసం) అసలు ధ్యేయం, విశ్వవ్యాప్త ఇస్లామీయ విప్లవం, ఇస్లామీయ సంస్కృతిని స్థాపించడం అన్నది పటిష్టమైన సోదర సంబంధాలపై ఆధారపడి ఉన్న అంశం. ఈ ధ్యేయ సాధన సులభమైన విషయం కాదు. ఇందులో అడుగడుగునా కష్టనష్టాలకు గురి కావలసి ఉంటుంది. పరీక్షల వెల్లువ రావచ్చు. కాబట్టి ఈ కఠినమైన బాధ్యతను నెరవేర్చటానికి ప్రతి వ్యక్తితో స్నేహ సంబంధాలు ఎంతో విలువైనవి. దీని లేమిని ఎట్టి పరిస్థితిలోనూ పూరించలేము.

ఒక వ్యవస్థీకృతమైన, క్రమశిక్షణాయుతమైన సమూహం లేనిదే సామూహిక విప్లవం దుర్లభం. క్రమశిక్షణాయుతమైన, వ్యవస్థీకృతమైన జమాఅత్‌ను ఏర్పాటు చేయాలంటే దానిలోని (సభ్యులు) కార్యకర్తలు పరస్పరం పటిష్టమైన సంబంధాలను ఏర్పరచుకోవాలి. సీసం పోతపూసిన గోడవలే కార్యకర్తల సంబంధాలు దృఢంగా ఉన్నప్పుడే ధ్యేయసాధన దిశగా గట్టి ప్రయత్నాలు జరుపగలం. ఎలాంటి వైమనస్యాలు విభజనకు కార్యకర్తల మధ్య తావుండకూడదు. ఇటువంటి పటిష్ఠ ప్రయత్నమే సాఫల్యాన్ని చేకూర్చగలదు. అల్లాహ్ దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా సెలవిచ్చాడు :

> **"విశ్వాసులారా! సహనంతో వ్యవహరించండి, అసత్యవాదుల ముందు పరాక్రమం చూపండి. సత్యసేవ కొరకు సిద్ధంగా ఉండండి. అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. తద్వారా మీరు సాఫల్యం పొందే అవకాశం ఉంది."** *(ఆలి ఇమ్రాన్ : 200)*

అన్‌ఫాల్ సూరా చివరలో ఇస్లామీయ విప్లవ పరిపూర్ణతకు ముస్లింల మధ్య సంబంధాల పటిష్టత ఒక అత్యవసర షరతుగా చెప్పబడింది. విశ్వసించినవారు ధర్మమార్గాన ప్రతి వస్తువును త్యజించాలి. ఈ ప్రయత్నంలో సర్వమూ సమర్పించాలి. వారి పరస్పర సంబంధాలు స్నేహాభిమానాలతో కూడుకుని ఉండాలి.

**"విశ్వాసాన్ని స్వీకరించి వలసపోయినవారు అల్లాహ్ మార్గంలో తమ ప్రాణాలనూ, తమ సంపదలనూ ఒడ్డి పోరాడినవారూ, వలస వచ్చినవారికి ఆశ్రయం ఇచ్చి సహాయం చేసినవారూ – వారే అసలు ఒకరికొకరు స్నేహితులు, సంరక్షకులూను." (అన్ఫాల్ : 72)**

ముస్లింలలో ఈ ప్రేమానురాగాలు లేకుంటే, న్యాయం, శ్రేయోభిలాష దైవభీతి పునాదులుగా ఇస్లామీయ మార్పును సాధించడం ఈ ధరణిపై సాధ్యం కాదు. ఫలితంగా అల్లాహ్ యొక్క ఈ భూమి అల్లకల్లోలంతో నిండిపోతుంది. ఎందుకంటే ముస్లింలు స్నేహబంధం లేకుండా ఇస్లాం వ్యతిరేక శక్తులతో పోరాడలేరు.

**"సత్యతిరస్కారులు పరస్పరం సహాయం చేసుకుంటారు. ఒకవేళ మీరు పరస్పరం సహాయం చేసుకొనకపోతే భూమిపై హింసా దౌర్జన్యాలు, అల్లకల్లోలం చెలరేగుతాయి." (అన్ఫాల్ : 73)**

ఇస్లామీయ సంస్కృతి స్థాపన, ఇస్లామీయ విప్లవాన్ని సాధించే ఈ ప్రయత్నాలు విశ్వాసానికి గీటురాళ్ళు.

**"విశ్వసించి అల్లాహ్ మార్గంలో ఇల్లూ వాకిలీ వదలిపెట్టి కృషి చేసినవారూ, వారికి ఆశ్రయమిచ్చి సహాయం చేసినవారూ – వారే నిజమైన విశ్వాసులు." (అన్ఫాల్ : 74)**

దీనికంటే ముందు ఇస్లామ్ వ్యతిరేక శక్తులను ప్రతిఘటించటంలో తన సహాయ సహకారాల గురించి అల్లాహ్ వాగ్దానం చేశాడు. ఇంకా ముహమ్మద్ (స)కు మద్దతునిచ్చిన విశ్వాసుల సమాజాన్ని సమైక్యపరచి వారి హృదయాలను కలిపాడు.

**"తన సహాయంతోనూ, ముస్లిముల ద్వారానూ నిన్ను ఆదుకున్నవాడూ, ఇంకా ముస్లిముల ద్వారానూ నిన్ను ఆదుకున్నవాడూ, ఇంకా ముస్లిముల మనస్సులను ఒకదానితో ఒకటి కలిపినవాడూ ఆయనే కదా!"**

*(అన్ఫాల్ : 62)*

ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తల మధ్య ఉన్న ఈ సంబంధం – సోదర సంబంధం, స్నేహ సంబంధం, కారుణ్య సంబంధం, ప్రేమ సంబంధం. అయినా సౌభ్రాతృత్వ

సంబంధమనే పదమే చాలా సర్వతోముఖమైనది. ఇది తనలో అన్నింటినీ సమకూర్చు కొంటుంది. ఉద్యమ కార్యకర్తలు పరస్పరం అన్నదమ్ములవలే కలసిమెలసి ఉండాలి. ఎందుకంటే అన్నదమ్ముల సంబంధం ఒక ఎడతెగని బంధం, విడదీయరాని బంధం, అజేయమైన అనుబంధం.

వారు తమలో ఎలాంటి భేదభావాలు, ఉపద్రవం, అనైక్యతలను భరించలేరు. అదేవిధంగా వారు పరస్పరం సర్వాన్ని త్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉంటారు. వారు పరస్పరం శ్రేయోభిలాషులై, సహాయ సహకారాలను అందించుకోవడంలో నిమగ్నులై ఉంటారు. పరస్పరం అండదండగా ఒకరికొకరు నీడగా ఉంటారు. వారు పరస్పరం సుఖ దుఃఖాలలో పాలుపంచుకుంటారు. తమ వ్యవహారాల్లో తోటివారి పట్ల పూర్తి నమ్మకాన్ని ప్రదర్శిస్తారు. వారి మధ్య ఒక అనురాగం ఉంటుంది. ఇది వారి హృదయంలో పదిలంగా ఉంటుంది. అదే వారి హృదయాలకు ఉత్తేజాన్ని కలుగజేస్తుంది. ఇదేవిధంగా సత్యమార్గ బాటసారుల మధ్య సత్సంబంధాలు ఉండాలి. ఇలాంటి వారే తమ ధర్మం కొరకు సర్వాన్నీ ధారపోయగలరు. ఇస్లామీయ విప్లవం పట్ల వ్యక్తికి ఎంత నిబద్ధత ఉంటుందో అతడు అంతే దృఢంగా తోటివారితో అతడి స్నేహ సంబంధాలను ఏర్పరచుకుంటాడు. ఆశయ సాధన ఎవరికెంత ఇష్టమో అంత దృఢంగా తోటివారితో సంబంధాలు ఉంటాయి. ఎందుకంటే ఈ సంబంధం కేవలం దైవం కొరకే అయి ఉంటుంది. కేవలం అల్లాహ్ కొరకే అల్లాహ్ మార్గంలో ఇస్లామీయ మార్పు కోసం ప్రయత్నం చేసేవారి మధ్య సంబంధాలు కేవలం బాటసారుల సంబంధాల మాదిరిగా ఉంటే వారు తమ మార్గమేమిటో ఒకసారి పునఃపరిశీలించుకోవాలి. స్నేహ సంబంధాలకు దుమ్ము ధూళి పాటి విలువ ఇవ్వని వ్యక్తి తాను తన ఆశయానికి ఎంత విలువ ఇవ్వగలడో ఆలోచించాలి. ఈ సోదర సంబంధం ప్రాధాన్యతను తెలియజేస్తూ ముహమ్మద్ ప్రవక్త (సఅసం) 'అల్ హుబ్బులిల్లాహ్' అనే సమగ్రమైన పదాన్ని ఉపయోగించారు. ఇది పవిత్రమైన పదం, హృదయాన్ని మార్చివేసే పదం. ప్రేమ అనేది ఒక ఆకర్షణ గల, తీయని పదం. కేవలం అల్లాహ్ కొరకే ప్రేమ - అన్ని రకాల కల్మషాల నుండి, అవాంఛనీయాల నుండి పరిశుద్ధమై ఉన్నత శిఖరానికి చేరుస్తుంది. ఈ విధంగా ఈ పదం మనోమస్తిష్కాలకు ఒక కొలమానాన్ని ఇస్తుంది. దీనితో ప్రతి విశ్వాసి తన సంబంధాలను కొలుచుకోవచ్చు.

అల్లాహ్‌పై విశ్వాసం అల్లాహ్ మార్గంపై ప్రేమ కలిగి ఉండడం అన్న అంశాలు రెండింటిలో ఒకటి ఉంటే రెండోది తప్పక ఉంటుంది. ఒకటి లేకుంటే రెండోది అనుమానాస్పదమే. అందుకే ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ఈ విధంగా సెలవిచ్చారు: 'మీరు పరస్పరం ప్రేమించుకోనంత వరకు విశ్వాసులు కాలేరు.' (అబూ హురైరా ఉల్లేఖనం - ముస్లిం) విశ్వాసుల మధ్య పూర్తి సంబంధాలను ఈ పునాదిపై ఏర్పాటు చేయడానికి గాను అల్లాహ్ కొరకే రాగద్వేషాలు విశ్వాస పరిపూర్ణతకు గీటురాయిగా వివరించారు.

'ఎవడైతే కేవలం అల్లాహ్ కొరకే ప్రేమిస్తాడో, కేవలం అల్లాహ్ కొరకే ద్వేషిస్తాడో (శత్రుత్వం వహిస్తాడో), కేవలం అల్లాహ్ కొరకే ఇతరులకు ఏదైనా ఇస్తాడో, కేవలం అల్లాహ్ కొరకు ఇవ్వటానికి నిరాకరిస్తాడో అతను తన విశ్వాసాన్ని పరిపూర్ణం గావించుకున్నాడు.'

రాగ ద్వేషాలనేవి మనిషి జీవితంపై తీవ్ర ప్రభావం వేసే భావావేశాలు. ఈ భావావేశాలు అల్లాహ్‌పై విశ్వాసం ఆధారంగా ఉండడమన్నది, విశ్వాస పరిపూర్ణతకు గీటురాయిగా భావించడం సముచితం. విశ్వాసం (ఈమాన్) లో అనేక శాఖలున్నాయి. ప్రతి శాఖకు దానిదైన ప్రాముఖ్యం ఉంది. అల్లాహ్ కొరకే ఒకరినొకరు ప్రేమించటం అన్న సూత్రం పటిష్ఠమైన సామాజిక నిర్మాణానికి అవసరం. ఇస్లామీయ మార్పు సాధించి సమాజాన్ని పటిష్ఠపరచటానికి ఇది అత్యంత అవసరం. అందుకే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) సత్సంబంధాలు నెలకొల్పుకోవడాన్ని అన్నింటికన్నా ఉత్తమమైన ఆచరణగా పేర్కొన్నారు.

హజ్రత్ అబూజర్ (రజి) ఉల్లేఖనం : ఒకసారి ముహమ్మద్ ప్రవక్త (సఅసం) మా వద్దకు వచ్చారు. అల్లాహ్‌కు ఇష్టమైన పనులలో ఏ పని అత్యంత ప్రీతిపాత్రమైనది అని అడిగారు. (దీనికి జవాబుగా) కొందరు నమాజ్, జకాత్ అని సెలవిచ్చారు. మరికొందరు జిహాద్ అన్నారు. అపుడు ముహమ్మద్ (సఅసం) అన్నారు - 'కేవలం అల్లాహ్ కొరకే ప్రేమించడం అల్లాహ్ కొరకే శత్రుత్వం వహించడం అల్లాహ్‌కు అత్యంత ప్రీతిపాత్రమైనది' అని సెలవిచ్చారు. (అబూదర్‌దా)

మరొక సందర్భంలో అబూజర్ (రజి) గారిని ఉద్దేశించి ప్రవక్త మహనీయులు ఇలా అడిగారు : 'విశ్వాసంలోని ఏ అంశం పటిష్ఠమైనది' అని? జవాబుగా అబూజర్ (రజి), 'దేవుడు, దేవుని ప్రవక్తకే ఈ విషయం బాగా తెలుసు' అని అన్నారు. దానికి ముహమ్మద్ (సఅసం) 'అల్లాహ్ మార్గంలో స్నేహం, అల్లాహ్ మార్గంలో మైత్రి, వైరాలు' అని సెలవిచ్చారు. (బైహఖీ)

ఈ హదీసులో 'ఉరా' అనే పదం కనబడుతుంది. 'ఉరా' అంటే పరిధి లేదా ఒక ఆవరణ లేదా ఒక చెట్టు అని అర్థం. ఈ చెట్టు ఆకులు ఆకురాలు కాలంలో కూడా రాలవు. పళ్లాల వరుసను పెట్టి పట్టుకునే సాధనాన్ని కూడా ఉరా అంటారు. అనగా అల్లాహ్ మార్గంలో ప్రేమ అనేది ఒక పటిష్టమైన ఆధారం. దీని ద్వారానే మనిషి అల్లాహ్‌పై తన విశ్వాసాన్ని సంపూర్ణంగా తనలో నింపుకోగలడు. ఈ ఆధారం తెగిపోనిది, మోసపోనిది. ఎవరూ దీన్ని భంగం కలిగించలేరు.

అసలు విషయం ఏమిటంటే, అల్లాహ్‌పై విశ్వాసం అనేది జీవితాంతం కట్టుబడి ఉండవలసిన విశ్వాసం (ఈమాన్) 'దేహంలో ప్రాణం ఉన్నంతకాలం అనుక్షణం అల్లాహ్ పట్ల విశ్వాసానికి అనుగుణంగా జీవితం గడపాలి. విశ్వసించిన వారి మధ్య పరస్పరం సంబంధాలకు 'అల్లాహ్ పట్ల ప్రేమ' అన్న సూత్రమే ఆధారంగా ఉండాలి. అప్పుడే మనిషి జీవితంలో సత్కర్మలు ఆచరించగలడు. మానవ జీవితంలో పరస్పర సంబంధాలనేవి అతి ముఖ్యమైనవి. ఈ సంబంధాలు మనిషిపై గొప్ప ప్రభావాన్ని వేస్తాయి. ఒక విధంగా చెప్పాలంటే మనిషికున్న స్నేహ సంబంధాలు అతడి ధార్మిక ఆచరణలకు ప్రేరణలవుతాయి. అందువల్లనే సత్యధర్మాన్ని విశ్వసించిన వారు పరస్పరం సన్నిహిత సంబంధాలు కలిగి ఉండాలని అల్లాహ్ ఆదేశించాడు. సహనం కలిగి ఉండాలని కూడా పేర్కొన్నాడు. ఎందుకంటే, వారు సత్యమార్గంలో నడిచేటప్పుడు ప్రాపంచిక సుఖభోగాల ప్రభావం వల్ల వారి దృష్టి చెదరకుండా ఉండడానికి సహనం అత్యంతావశ్యకం.

**"తమ ప్రభువు ప్రసన్నతను అర్థిస్తూ ఎవరు ఉదయం సాయంత్రం ఆయనను వేడుకుంటారో, వారి సాహచర్యం పట్ల నీ హృదయాన్ని సంతృప్తపరచుకో. వారి నుండి నీ దృష్టిని ఏమాత్రం మరల్చకు. నీవు ఇహలోకపు మెరుగులు కోరుకుంటావా?" (అల్ కహఫ్ : 28)**

ఈ నేపథ్యంలో దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) కూడా ఇలా హెచ్చరించారు: "మనిషి తన స్నేహితుని ధర్మం వల్ల ప్రభావితుడవుతాడు. కావున మీలో ప్రతి ఒక్కరు బాగా ఆలోచించి మీ స్నేహితుణ్ణి ఎంపిక చేసుకోండి." (అబూ హురైరా ఉల్లేఖనం – అహ్మద్, తిర్మిజి, అబూదావూద్, బైహఖీ)

ఈ హదీసులో స్నేహితుడు అన్న భావంలో వాడబడిన పదం 'ఖలీల్'. ఈ పదం 'ఖిల్లత్' అన్న పదం నుంచి పుట్టింది. ఖిల్లత్ అంటే 'మనస్సులో నాటుకొని స్థిరనివాస మేర్పరచుకునే ప్రేమ' అని అర్థం. మంచి వ్యక్తులతో చెడు వ్యక్తులతో స్నేహ సంబంధాల గురించి ఉదాహరణలు కూడా ఈ హదీసులో ఇవ్వబడ్డాయి. మంచి వ్యక్తితో స్నేహం అనేది అత్తరు అమ్మేవానికి దగ్గరగా ఉండడం లాంటిది. మనకు అత్తరు దొరకకపోయినా ఆ సువాసన మన మనో మస్తిష్కాలపై ప్రభావం వేస్తుంది. అలాగే చెడు వ్యక్తితో స్నేహాన్ని కమ్మరి కొలిమితో పోల్చడమైనది. అక్కడి నిప్పురవ్వలకు బట్టలు కాలకపోయినా మసి అంటుకుంటుంది, పొగలు ఆలోచనలపై ముసురుకుంటాయి.

అల్లాహ్ పట్ల విశ్వాసంలో ఒక దశ ఏమిటంటే, విశ్వాసం కలిగి ఉన్న వ్యక్తి విశ్వాసానికి సంబంధించిన ఆచరణలు పాటించి సంతోషాన్ని, సంతృప్తిని అనుభవిస్తాడు. ఈ సంతుష్టి సంతృప్తి వల్ల సత్కర్మలకు కావలసిన ప్రేరణ మనిషిలో జనిస్తుంది. ఈ అనుభూతిని మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ పట్ల విశ్వాసానికి గీటురాయిగా అభివర్ణించారు. దీనికి ఆయన మూడు షరతులు పేర్కొన్నారు. అవి –

"మనిషి ప్రేమించేవాడయి ఉండాలి, అయితే ఆ ప్రేమ కేవలం అల్లాహ్‌కే పరిమితమై ఉండాలి."

ఒక దాసునికి, ఒక సేవకునికి తన స్వామి ప్రేమ లభిస్తే ఇంకా అంతకు మించి అతడికేం కావాలి?

ఒక విశ్వాసికి అల్లాహ్ ప్రేమ ప్రాప్తమయితే అంతకన్నా సౌభాగ్యం ఏముంటుంది? ఇది విశ్వాసిలోని అత్యున్నత స్థాయి ప్రేమ. ప్రవక్త ఇంకా ఇలా సెలవిచ్చారు : అల్లాహ్ కోసం మాత్రమే పరస్పరం సోదర సంబంధాలు ఏర్పరుచుకున్నవారు అత్యున్నత అనుగ్రహాలకు అర్హులవుతారు. ముఆజ్ బిన్ జబల్ (రజి) ఇలా ఉల్లేఖించారు : "ఎవరైతే నా (అల్లాహ్) కొరకు పరస్పరం ప్రేమించుకుంటారో, నా కోసం కలిసి కూర్చుంటారో, నా కోసం ఇతరులను కలవడానికి

వెళతారో, నా కోసం ఒకరిపై ఒకరు సంపద ఖర్చు పెడతారో, వారికి నా ప్రేమ లభించటం తప్పనిసరి అయిపోతుంది" అని అల్లాహ్ సెలవిచ్చాడని ప్రవక్త ప్రవచించారు. ప్రాపంచిక జీవితంలో కేవలం అల్లాహ్ కొరకు ఇతరులను ప్రేమించడం వల్ల కలిగే ఫలితం ఇది. తీర్పుదినం నాడు, మనిషి చేసిన ప్రతి చిన్న సత్కార్యం అత్యంత విలువైనదిగా కనబడినపుడు, ఒక ఖర్జూరం దానంగా ఇచ్చిన పుణ్యం, ఒక మంచి మాట పలికిన పుణ్యం కూడా మనిషికి ఎనలేనిదిగా కనబడే రోజున ఈ సత్సంబంధాలు మనిషిని ఉన్నత స్థానానికి చేర్చడంలో సహాయపడతాయి. ఇస్లామీయ విప్లవానికి ఈ సంబంధాలు అత్యంతావశ్యకం.

అంతిమ తీర్పు జరిగే రోజున మనిషి ఇతరులెవ్వరినీ పట్టించుకోడు. తన తల్లిదండ్రులు, భార్యాపిల్లలు, సోదరుల ధ్యాస ఉండనే ఉండదు. శిక్ష నుండి తప్పించుకోవడానికి వాళ్ళందరిని పరిహారంగా ఇవ్వడానికి సిద్ధపడతాడు.

స్నేహ సంబంధాల నిజరూపం ఆనాడు బట్టబయలై పోతుంది. ప్రపంచంలో ప్రాణ స్నేహితునిగా ఉన్నవాడు అక్కడ శత్రువుగా మారిపోతాడు. కాని అల్లాహ్ పట్ల భయభీతులతో బ్రతికిన వారి మధ్య స్నేహ సంబంధాలు చెక్కు చెదరవు. ప్రపంచంలోని వారి స్నేహం ఈ రోజున ఎంతగా ఉపయోగపడిందో వారికి అర్థమవుతుంది.

తీర్పుదినం నాడు – ప్రపంచంలో చేసిన కర్మల లెక్కలు తేల్చేరోజున స్నేహితులు శత్రువులయిపోయే రోజున, కేవలం దైవభయం కలవారు, అల్లాహ్ కోసం మాత్రమే స్నేహితులైనవారి స్నేహం మాత్రమే చెక్కుచెదరక నిల్చి ఉంటుంది. అల్లాహ్ హితబోధను విశ్వసించి, అల్లాహ్ ఆదేశాలకు అనుగుణంగా జీవితం గడిపిన వారితో ఆ రోజున దేవుడు 'నా దాసులారా! ఈనాడు మీకు ఏ భయమూ లేదు, ఏ దుఃఖం కలుగదు.' (జుఖ్రుఫ్ – 68) అని సెలవిస్తాడు. ఈ విధంగా మనిషి ఎలాంటి స్నేహం చేస్తాడో దాని ఫలితం కూడా అలాగే ఉంటుంది. ఒక మనిషి పశ్చిమ ప్రాంతంలో నివసిస్తూ తూర్పు ప్రాంతాన ఎక్కడో ఉన్న వ్యక్తితో కేవలం అల్లాహ్ కొరకు స్నేహ సంబంధాలు నెలకొల్పుకున్నట్లయితే, తీర్పుదినాన విశ్వప్రభువు ఆ ఇద్దరు మిత్రులను ఒక చోటికి చేర్చి 'నువ్వు ప్రేమించిన స్నేహితుడు ఇతడు' అని పరిచయం చేస్తాడు. (బుఖారీ, ముస్లిం, అబూ మూసా అష్అరీ)

ఆ రోజున, పాదాల క్రింద అగ్ని భగభగ మండుతూ ఉంటుంది. తలలపై

అగ్ని కణాలు వర్షించే మేఘాలు అలుముకొని ఉంటాయి. పాపులను అగ్ని అన్ని దిశల నుంచి, కుడి ఎడమల నుంచి, ముందు వెనుకల నుంచి కబళిస్తూ ఉంటుంది. ఆ రోజున మనిషికి రక్షణ ఇచ్చే శరణు ఒకేచోట ప్రాప్తమవుతుంది. విశ్వప్రభువు సింహాసనం నీడలో మాత్రమే రక్షణ లభిస్తుంది. అక్కడ కేవలం ఏడు తరగతులకు చెందిన మనుషులకు మాత్రమే రక్షణ లభిస్తుందని ముహమ్మద్ ప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. వారిలో కేవలం అల్లాహ్ కొరకు మాత్రమే పరస్పరం ప్రేమ కలిగి ఉన్నవారు, అల్లాహ్ కోసం మాత్రమే ఒండొరులతో కలిసేవారు, అల్లాహ్ కోసం మాత్రమే విడిపోయేవారు కూడా ఉన్నారని చెప్పబడింది. (అబూ హురైరా ఉల్లేఖనం - బుఖారీ, ముస్లిం)

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇంకా ఇలా తెలిపారు : వారిపై అల్లాహ్ కారుణ్యం వర్షిస్తుంది. అల్లాహ్ ప్రళయదినాన 'నా కోసం పరస్పరం ప్రేమైక సంబంధాలు ఏర్పరచుకొన్నవారు ఎక్కడున్నారు? ఈ రోజున వారికి నా నీడలో చోటు ప్రసాదిస్తున్నాను. ఈ రోజున నా నీడ తప్ప మరెక్కడా (తలదాచుకునే) నీడలేదు' అంటాడు. (అబూహురైరా ఉల్లేఖనం - ముస్లిం). వారికి ప్రసాదించబోయే అత్యున్నత స్థాయి గురించి అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు : "నా కోసం పరస్పరం స్నేహం చేసిన వారికి ప్రళయదినాన తేజోవంతమైన స్థానం లభిస్తుంది. అది చూసి అమరవీరులు (షహీద్‌లు) ప్రవక్తలు ఈర్ష్య చెందుతారు." (ముఆజ్ బిన్ జబల్ (రజి) కథనం - తిర్మిజీ)

అల్లాహ్‌పై విశ్వాసం ప్రాతిపదికగా, కేవలం అల్లాహ్ కోసం ఏర్పడే సత్సంబంధాలు ఇస్లామీయ ఉద్యమానికి ఎంతైనా అవసరం. ఎంత అవసరమంటే ఇలాంటి సంబంధాలు లోపించడాన్ని భరించరాని బాధాకరమైన పరిస్థితిగా పరిగణించటం జరిగింది. ఒండొరుల మధ్య సత్సంబంధాల కోసం ప్రయత్నించకపోవడం, పరస్పర విభేదాలను పరిష్కరించుకునే ప్రయత్నాలు లేకపోవడం, పరస్పర సంబంధాలను భంగపరచడం మొదలైన చర్యలకు పాల్పడే వారి గురించి అల్లాహ్ ఆదేశాల ప్రస్తావన ముందు పేజీల్లో ఉంది. ఈ విషయమై ప్రవక్త ముహమ్మద్ (సఅసం) సెలవిచ్చిన పలుకులను మనం సదా గుర్తుంచుకోవాలి. 'సత్సంబంధాలు లేకుండా ఉండడమంటే సంపూర్ణ ధర్మాన్ని క్షురకుని కత్తితో క్షవరం చేయటమే.' (అబూహురైరా ఉల్లేఖనం - అహ్మద్, తిర్మిజి)

దీనిని బట్టి సత్సంబంధాల ప్రభావం ఎలాంటిదో, ఎలా శాశ్వతంగా, సంపూర్ణ ప్రభావాన్ని వేస్తాయో మనం అర్థం చేసుకోవచ్చు. మనస్ఫూర్తిగా ఇస్లాంను అనుసరించే

వ్యక్తి తనతోటి వారితో తప్పకుండా ప్రేమైక సంబంధాలు కలిగి ఉంటాడు. ఈ సంబంధాలను ఎంతో విలువైనవిగా, ఎంతో ఇష్టమైనవిగా భావిస్తాడు. వీటికోసం ఎంతటి నష్టాన్నైనా భరిస్తాడు.

ఇస్లామీయ ఉద్యమంలో కార్యకర్తల మధ్య ప్రేమాభిమానాలతో కూడుకున్న సంబంధాలు నిజానికి అల్లాహ్ ప్రసాదించిన అత్యుత్తమ కానుకలు. ఈ కానుకలు ఇస్లామీయ ఉద్యమానికి వరప్రసాదాలు, ఎందుకంటే ఈ సత్సంబంధాలు ఉద్యమానికి ఊపిర్లు. సత్యమార్గంపై నడిచే కార్యకర్తలకు ఈ సంబంధాలు వివిధ దశలను అధిగమించే బలాన్నిస్తాయి. సత్యమార్గాన నడిచేలా ఒండొకరిని ప్రేరేపించేలా కార్యకర్తలను తీర్చిదిద్దుతాయి. పూర్వకాలంలో కూడా ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తల మధ్య ప్రేమాభిమానాలతో కూడుకున్న సంబంధాలను ప్రసాదించిన దైవం ఖుర్ఆన్‌లో ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ 'అల్లాహ్ మీకు చేసిన మేలు జ్ఞప్తికి తెచ్చుకోండి. మీరు పరస్పరం శత్రువులుగా ఉండేవారు. ఆయన మీ హృదయాలను కలిపాడు. ఆయన కటాక్షం వల్లనే మీరు సోదరులయ్యారు' అని అన్నాడు.

అన్‌ఫాల్ సూరాలో ముహమ్మద్ (సఅసం)ను సంబోధిస్తూ అల్లాహ్ ఈ విధంగా అంటున్నాడు. ప్రపంచంలో ఉన్న సంపద అంతా ఖర్చు చేసినప్పటికీ నీవు వారి మధ్య ప్రేమాభిమానాలు జనింపజెయ్యలేవు. ఈ పని కేవలం అల్లాహ్ మాత్రమే చేయగలడు. అల్లాహ్ ప్రసాదించిన ధర్మం, దానిపై విశ్వాసం, ప్రేమల ఫలితంగా జనిస్తాయి ఈ సత్సంబంధాలు.

**'నీవు సమస్త భూసంపదను ఖర్చు పెట్టినా వారి మనసులను కలుపగలిగి ఉండేవాడివి కావు. కాని అల్లాహ్ వారి మనస్సులను కలిపాడు.'**

*(అన్‌ఫాల్ : 63)*



## రెండవ భాగం

# నడవడికి సంబంధించిన మౌలిక అంశాలు

పరస్పర సంబంధాల గురించి ఇస్లాం నిర్దేశించిన ప్రమాణాలను ఆచరణలో తేవడానికిగాను హక్కులు బాధ్యతల ఒక నియమావళిని దైవం, దైవప్రవక్త బోధించారు. దీనిని అమలు చేయడం ద్వారా ఇస్లాం ప్రమాణాలకు అనుగుణంగా పరస్పర సంబంధాలు నెలకొల్పగలం. ఈ నియమావళి కొన్ని మౌలిక లక్షణాలపై ఆధారపడి ఉంది. మనిషి నడవడిలో ఈ లక్షణాలు చోటుచేసుకుంటే పైన చెప్పిన హక్కులు బాధ్యతల్లో ప్రతి ఒక్కటి ఈ మౌలిక అంశాల పరిధిలో నెరవేరుతూ పోతుంది. అంటే ఈ లక్షణాలను పెంపొందించుకోవడం వల్ల మనిషిలో తన బాధ్యతలు కర్తవ్యాలు నిర్వర్తించే ప్రేరణ జనిస్తుంటుంది. తద్వారా మనిషికి ప్రతిసారి హితబోధ, బయటి ప్రేరణల అవసరం ఉండదు. ఆ లక్షణాలలో మొదటిది శ్రేయోభిలాష -

## శ్రేయోభిలాష

శ్రేయస్సును కోరుకోవడం. హదీసులో 'నసీహ' అన్న పదం వాడబడింది. ఈ పదం విస్తృత అర్థం గల పదం. ప్రవక్త (సఅసం) 'అద్దీను అన్నసీహ' (శ్రేయోభిలాషే అసలు ధర్మం) అని మూడుసార్లు చెప్పారు. (ముస్లిం - పేజి : 423)

శ్రేయోభిలాష ఎవరి పట్ల ఎలా ఉండాలో కూడా వివరించడం జరిగింది. సాధారణ ముస్లింలందరు ఈ పరిధిలో ఉన్నారు. ఒకసారి ప్రవక్త (సఅసం) తన అనుచరులతో ముస్లింలందరి పట్ల శ్రేయోభిలాష కలిగి ఉండేలా ప్రతిజ్ఞ చేయించి వారి పరస్పర సంబంధాలలో ఎలాంటి లోపం రాకుండా చూశారు.

ఈ లక్షణాన్ని మరో విధంగా ఇలా కూడా చెప్పవచ్చు. మనిషి ఎల్లప్పుడూ తన తోటి వారి శ్రేయస్సును అభిలషిస్తూ ఉండాలి. తోటి వారికి మంచి చేయడానికి ముందుండాలి. వారికి లాభం చేకూర్చడానికి ప్రయత్నించాలి. తోటి వారి కష్టనష్టాలకు చలించిపోవాలి. ధార్మికంగానూ ప్రాపంచికంగాను సాధ్యమైన మేరకు సహాయపడాలి.

మనిషి తనపై కష్టనష్టాలు రావడాన్ని ఇష్టపడడు. ఎక్కువ లాభం పొందాలని కోరుకుంటాడు, ప్రయత్నిస్తాడు. తనకు వాటిల్లే నష్టాన్ని భరించలేడు. తన లాభం కోసం వ్యయ ప్రయాసలతో పనిచేస్తాడు. తనకు చెడు జరగాలని ఎవరూ అనుకోరు. మంచి జరగాలనే కోరుకుంటారు. శ్రేయోభిలాష అంటే మనిషి తన స్వయం పట్ల కలిగి ఉన్న ఈ భావాలే తోటివారి పట్ల కూడ కలిగి ఉండడం. ఈ లక్షణాన్ని పెంపొందించుకోవాలి. ముహమ్మద్ (సఅసం) ఈ లక్షణాన్ని విశ్వసించిన వారి విశ్వాస స్థాయికి ప్రమాణంగా పేర్కొన్నారు.

"ఎవరి అధీనంలో నా ప్రాణం ఉందో ఆయన సాక్షిగా! ఒక దైవదాసుడు తనకోసం యేది ఇష్టపడతాడో అదే తన తోటి సోదరుని కోసం ఇష్టపడనంత వరకూ అతడు నిజమైన విశ్వాసి కాజాలడు."

అదేవిధంగా ఒక విశ్వాసి, మరొక విశ్వాసిపై కలిగి ఉండే హక్కుల గురించి, ఒండొరుల పట్ల ఉండవలసిన శ్రేయోభిలాష గురించి ఈ విధముగా చెప్పడం జరిగింది.

"విశ్వాసి తన తోటి వాని శ్రేయస్సు కాంక్షించాలి - ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని."

ఒక ముస్లింకు మరొక ముస్లింపై ఆరు హక్కులు (బాధ్యతలు) ఉన్నాయి. అందులో, తన కోసం ఇష్టపడినదే తోటివాని కోసం ఇష్టపడడం కూడా ఒకటి. తోటివాని పట్ల శ్రేయోభిలాష అనే లక్షణం పరిధిలో ఎన్ని హక్కులు ఎన్ని బాధ్యతలు ఉన్నాయో, దాని ప్రాముఖ్యమేమిటో మున్ముందు మరింత వివరంగా తెలుసుకుందాము.

## త్యాగం

ఒక విశ్వాసి తన కోసం ఇష్టపడినదే తోటి సోదరుని కోసం ఇష్టపడడమే కాక తోటి వానికి తన కంటే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడాన్ని త్యాగం అనవచ్చు. ఇది విశ్వాసానికి ఉండవలసిన రెండవ ముఖ్య లక్షణం. త్యాగాన్ని అరబ్బీలో 'ఈసార్' అంటారు. ఈ పదం "ఇస్ర్" అన్న మూలం నుంచి పుట్టింది. "ఇస్ర్" అంటే ప్రాధాన్యత నీయడం, అడుగు ముందుకేయడం అని అర్థాలున్నాయి. తన సొంత లాభాన్ని విడిచి,

తన అవసరాన్ని పక్కన పెట్టి, ఇతరుల లాభం కోసం కృషి చేయడం, తోటివాని అవసరం తీర్చడం ఈసార్. తాను స్వయంగా కష్టాలను మీద వేసుకొని తోటివాని కష్టం తీర్చడం, తాను ఆకలి కడుపుతో ఉండి ఇతరులకు కడుపు నిండా పెట్టడం, తాను బాధలను అనుభవిస్తూ కూడ ఇతరుల బాధలను తొలగించానికి ప్రయత్నించడం "ఈసార్". నైతిక ప్రమాణాల రీత్యా ఈ లక్షణం అత్యున్నతమైనది. ప్రతి వ్యక్తిలోను ఈ లక్షణం ఉండడం సాధ్యం కాకపోవచ్చు. అందువల్ల దీని ప్రాతిపదికన హక్కులు, బాధ్యతలు నిర్ధారించడం కుదరదు. కాని ఈ లక్షణం కలిగి ఉండాలని, ఈ లక్షణం వల్ల ఒనగూడే ప్రత్యేక ప్రయోజనాలు పొందాలని చెప్పబడింది.

ఒక మనిషి మనస్తత్వానికి మరొక మనిషి మనస్తత్వానికి తేడా ఉంటుంది. అలాగే వ్యక్తుల అవసరాలలోను వ్యత్యాసం ఉంటుంది. అందువల్ల ప్రతి వ్యక్తి అవసరాలను పూర్తి చేయడంలో సమాజం నిమగ్నం కావడం వల్ల సమాజంలో అనవసరమైన ఒత్తిడి పెరగవచ్చు. అయితే మనిషి మనస్తత్వంలో ఇతరుల ఇష్టాన్ని, అభీష్టాన్ని, అభిలాషను గుర్తించి వాటికి ప్రాధాన్యత నిచ్చే సుగుణం చోటు చేసుకుంటే సమాజంలో ఆరోగ్యవంతమైన, ఆనందదాయకమైన సంబంధాలు ఏర్పడతాయి.

"త్యాగం"లో అత్యంత ఉన్నత స్థాయి ఏదంటే, ఒక వ్యక్తి తాను దుర్భర పరిస్థితుల్లో ఉండి కూడ తన తోటి వాని అవసరాలను తీర్చడం కోసం తన సొంత అవసరాలను ప్రక్కన పెట్టే వైఖరి. ప్రవక్త ముహమ్మద్ (సఅసం) సహచరుల జీవితాలను పరిశీలిస్తే ఇటువంటి అనేక సంఘటనలు కనబడుతాయి. దివ్య ఖుర్ఆన్ ఈ లక్షణాన్ని అభినందిస్తూ ఇలా అన్నది.

**"వారు స్వయంగా అగత్యపరులయినప్పటికీ తమకంటే పరులకే అధిక ప్రాధాన్యం ఇస్తారు." (అల్ హష్ర్ – 9)**

అన్సార్లు తాము దుర్భర పరిస్థితుల్లో ఉన్నప్పటికీ ముహాజిర్లను ఆహ్వానించి తమకున్నది పంచి ఇచ్చారు. త్యాగానికి ఇది అత్యుత్తమ ఉదాహరణ. ఖుర్ఆన్‌లోని పై వాక్యానికి ముందుగా హజ్రత్ అబూతల్హా అన్సారీ చూపిన త్యాగ గుణాన్ని అల్లాహ్ ప్రస్తావించాడు.

"ఒకసారి ముహమ్మద్ (సఅసం) వద్దకు ఒక వ్యక్తి ఆకలితో వచ్చాడు. అప్పుడు ప్రవక్త కుటీరంలో (అతనికివ్వడానికి) ఆహారం యేదీ లేదు. అప్పుడు ప్రవక్త (సహచరులనుద్దేశించి) "ఈ వ్యక్తికి ఈ రాత్రి ఆతిథ్యం ఇచ్చేవారిని అల్లాహ్ కటాక్షిస్తాడు" అన్నారు.

హజ్రత్ అబూ తల్హా ఆ వ్యక్తిని తన ఇంటికి తీసుకొనిపోయారు. ఇంట్లో కేవలం ఒక వ్యక్తికి సరిపడే ఆహారం మాత్రమే ఉందని భార్య తెలిపింది. అప్పుడు తల్హా దీపం ఆర్పివేసి పిల్లలను పడుకోబెట్టమని చెప్పారు. ఆ రాత్రి వారు పస్తు ఉండి, అతనికి భోజనం పెట్టారు. ఈ విషయం అతిథికి తెలియకుండా జాగ్రత్తపడ్డారు. మరునాడు ఉదయం ఆయన హజ్రత్ ముహమ్మద్ (సఅసం) ముందు హాజరయినప్పుడు ముహమ్మద్ (సఅసం) ఆయనతో, "అల్లాహ్ మీ మంచి ప్రవర్తనకు సంతోషించాడు" అని ఈ దివ్య వచనాన్ని వినిపించారు. (ముస్లిం, బుఖారి)

తన అవసరం తీర్చుకోలేని పరిస్థితులలో కూడ చూపిన త్యాగ గుణానికి నిదర్శనం ఈ సంఘటన. దీనికంటే ఉన్నతమైన మరో సంఘటన ఉంది. అది జిహాద్‌కు సంబంధించినది. యుద్ధ మైదానంలో గాయాలతో పడి ఉన్న ఒక వ్యక్తి దాహం తీర్చడానికి మంచి నీళ్ళు పంపబడ్డాయి. అతనికి నీరు త్రాగించ బోతుండగా మరో దిక్కు నుంచి దాహం అన్న శబ్దం వినబడింది. గాయపడిన మొదటి వ్యక్తి శబ్దం వచ్చిన దిక్కుగా చూసి నీళ్ళు అటు అందించండని కోరాడు. ఈ విధంగా ఆరుగురు గాయపడిన వ్యక్తుల వద్దకు ఆ నీళ్ళు వెళ్ళాయి. వారందరు నీరు అవతలి వారికివ్వండని కోరుతూ, తోటివారి ప్రాణాలకు తమ ప్రాణాల కన్నా అధిక ప్రాముఖ్యం ఇస్తూ మరణించారు. ఆరవ వ్యక్తి వద్దకు ఆ నీళ్ళు తీసుకుని వెళ్ళి చూసేసరికి అతను మరణించి ఉన్నారు. మళ్ళీ మొదటి వ్యక్తి వద్దకు వచ్చి చూస్తే అతని ప్రాణాలు కూడా పోయాయి. అల్లాహ్ వారితో ప్రసన్నుడవుగాక!

త్యాగం అంటే మనిషి తన కోసం మామూలు వస్తువును తీసుకుని తన తోటి వారికి మంచి వస్తువు ఇవ్వడం.

ఒకసారి ముహమ్మద్ (సఅసం) అడవిగుండా వెళుతున్నారు. వారు రెండు మిస్వాక్ (పళ్ళుదోముకునే పుల్లలు) కోసుకున్నారు. అందులో ఒకటి వంకరగా

ఉన్నది. రెండోది తిన్నగా ఉన్నది. వారితో ఒక సహచరుడు కూడా ఉన్నారు. తిన్నగా ఉన్న మిస్వాకును సహచరునికి ఇచ్చి వంకరగా ఉన్నది ప్రవక్త మహనీయులు తమ దగ్గర ఉంచుకున్నారు. అప్పుడు ఆ సహచరునితో 'ఎవరైనా వ్యక్తి ఇంకొకరితో క్షణం సేపు స్నేహం చేసినా అతడు స్నేహితుని హక్కు నెరవేర్చినాడా లేదా అని ప్రళయ దినాన అల్లాహ్ ప్రశ్నిస్తాడు' అని అన్నారు. స్నేహం అంటే అందులో త్యాగము చేరి ఉందని దీనిద్వారా తెలుస్తుంది. 'మనిషి నడవడికి సంబంధించిన ఈ రెండు ముఖ్య లక్షణాలు ఒక ముస్లింలో ఉన్నట్లయితే మధురమైన స్నేహ సంబంధాలు ఏర్పడతాయి. ఈ సంబంధాలు ఎన్నడూ బెడిసికొట్టవు. అల్లాహ్ దివ్య ఖుర్ఆన్‌లో ఈ రెండు లక్షణాలను కలిగి ఉండాలని ఆదేశించాడు.

**'న్యాయం చెయ్యండి అనీ, ఉపకారం చెయ్యండి అని అల్లాహ్ ఆజ్ఞాపిస్తున్నాడు'** *(అన్ నహ్లా - 90)*

అల్లాహ్ ఆజ్ఞాపిస్తున్నాడు అనే వాక్యం పరిశీలించదగ్గది.

న్యాయం అన్నది రెండు శాశ్వతంగా ఉండే వాస్తవాలపై ఆధారపడి ఉంది. ఒకటి ప్రజల హక్కులలో సమత్వం, సమతూకం ఉండడం. రెండోది ప్రతి ఒక్కరికి అతని హక్కును కాదనకుండా ఇవ్వడం. ప్రతి వ్యక్తికీ అతని నైతిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక హక్కులు నిజాయితీగా ఇవ్వటమే 'న్యాయం.' అనగా ఒక ముస్లిం తన తోటివానికి షరీయత్‌పరంగా లభించిన అన్ని హక్కులను నెరవేర్చాలి. షరీఅత్ అనుమతించిన విధంగా లావాదేవీలు జరగాలి. షరీఅత్ విధించిన షరతులకు లోబడి నడవడి ఉండాలి. ప్రవర్తన కూడా షరీయత్ పరిధిలోనే ఉండాలి. ఎందుకంటే షరీయత్‌లోనే న్యాయానికి సంబంధించిన అన్ని కోణాలు ఉన్నాయి.

**"వారితో (ప్రవక్తల) పాటు గ్రంథాన్ని, త్రాసునూ అవతరింపజేశాము. ప్రజలు న్యాయంపై స్థిరంగా నిలబడాలని."** *(హదీద్ - 5)*

అదే విధంగా ఒకవేళ ఎవరైనా తమకు జరిగిన చెడుకు ప్రతీకారం తీర్చుకోవాలనుకుంటే తీర్చుకోవచ్చు. ఎంత అయితే చెడు జరిగిందో దానికంటే ఎక్కువ ప్రతీకారం తీర్చుకొన్నట్లయితే అతడు న్యాయం పరిధులు దాటినట్లే. న్యాయం గురించి

ఇంకా వివరంగా ముహమ్మద్ (సఅసం) తమ ప్రవచనంలో ఇలా తెలియజేశారు : "వారు తెలియజేసిన తొమ్మిది మాటలలో ఒకటి ఇలా ఉంది – 'కోపంలోగాని, నిరసనలోగాని న్యాయంపై నిలబడండి.' మనోభిలాషలకు లొంగి న్యాయమార్గం విడిచిపెట్టకూడదు. మంచి నడవడికి గీటురాయి ఇదే. ఒక వ్యక్తి తన తోటివాని పట్ల హృదయంలో ఎత కల్మషం కలిగి ఉన్నా నడవడిక, ప్రవర్తన మాత్రం షరీఅత్‌కు అనుగుణంగా ఉండాలి. న్యాయం తర్వాత ముఖ్యమైన లక్షణం ఉపకారం. ఇది న్యాయం కంటే ఉన్నతమైనది.

## ఉపకార గుణం

పరస్పర సంబంధాలలో ఉపకార గుణం న్యాయం కంటే ఎక్కువ ప్రాముఖ్యం గలది. సంబంధాలకు న్యాయం మూలాధారం కాగా, ఉపకారం సంబంధాలకు అందాన్ని చేకూరుస్తుంది. సంబంధాలలో న్యాయం కోపతాపాలను రానీయకుండా చూస్తే ఉపకారం సంబంధాలను మధురంగా మార్చుతుంది. కొలపాత్రలతో తన హక్కులను కొలుచుకుంటూ, తనకూ ఇతరులకు ఎలాంటి ఎక్కువ తక్కువలు రాకుండా చూడటం వల్ల ఏ సంబంధం అయినను పటిష్ఠంగా ఉండదు. ఇటువంటి సంబంధంలో ఒడిదుడుకులు ఉండవు కాని, ఆ సంబంధంలో ప్రేమ, కృతజ్ఞతా భావం, హుందాతనం, త్యాగం, నైతికత, శ్రేయోభిలాష అనేవి కానరావు. ఉపకారం వలన మాత్రమే వీటిని పొందగలము. ఉపకారం (ఇహ్‌సాన్) అంటే సద్వ్యవహారరం, దాతృత్వం, దయా, ఔదార్యం, సహృదయత, క్షమాగుణం, సర్దుకుపోవడం, ఒకరినొకరు గౌరవముగా చూడడం, ఇతరులకు వారి హక్కుల కంటే ఎక్కువ ఇవ్వడం, తాను తన హక్కు కంటే తక్కువతోనే సంతృప్తి చెందడం మొదలైన గుణాలు.

పరోపకారం గురించి తొమ్మిది విషయాలు పేర్కొన్న ఓ హదీసులో మూడు విషయాలు మరింత వివరంగా ఉన్నాయి. "ఎవరు నాతో తెగత్రెంపులు చేసుకుంటారో వారితో నేను కలిసి ఉండాలి. ఎవరు నాకు (నా హక్కును) ఇవ్వరో నేను వారికి వారి హక్కులు ఇవ్వాలి. ఎవరు నాపై దౌర్జన్యం చేస్తారో వారిని నేను క్షమించాలి."

ఉపకార గుణం కలిగి ఉండడమంటే ఉపకారికి ఉపకారం చేయడం మాత్రమే

కాదు, అపకారి పట్ల కూడా ఉపకారం చేయాలి. తోటివాడు చెడు చేస్తే మంచితో జవాబు ఇవ్వాలి. "వారు 'చెడు'ను 'మంచి' ద్వారా తొలగిస్తారు." ఈ గుణాల పిదప దయాగుణం అతి ముఖ్యమైనది.

## దయా గుణం

ముస్లింల పరస్పర సంబంధాల స్వరూపాన్ని తెలియజేసే సందర్భంగా దైవం దయా గుణాన్ని ప్రస్తావించాడు. ఈ పదం చాలా విశాల భావాన్ని కలిగి ఉంది.

**"ముహమ్మద్ అల్లాహ్ ప్రవక్త. ఆయన వెంట ఉన్నవారు (సహచరులు) అవిశ్వాసుల పట్ల కఠినంగా ఉంటారు. పరస్పరం దయాగుణం కలిగి ఉంటారు." (అల్ ఫతహ్ - 29)**

మృదువైన మనస్సు కలిగి ఉండడంగా ఈ లక్షణానికి అర్థం చెప్పుకోవచ్చు. మృదుమనస్కుడైన మనిషి తన తోటివాని పట్ల ప్రేమ, కరుణ, వాత్సల్యం, సహృదయతలు కలిగి ఉంటాడు. తోటివానికి కలిగే చిన్నపాటి కష్టం కూడా భరించలేడు. దయాగుణం వలన మనిషి అందరి హృదయాలలో స్థానాన్ని పదిలపర్చుకుంటాడు. అలాంటి మనిషిని అందరూ ప్రేమిస్తారు. ముహమ్మద్ (సఅసం) సుగుణాలలో ఇది ఒకటి. దీనిని ఖుర్ఆన్ ఈ విధంగా ప్రస్తావించింది.

**"చూడండి! మీ వద్దకు ఒక ప్రవక్త వచ్చాడు. ఆయన స్వయంగా మీలోని వాడే. మీరు నష్టానికి గురికావడమనేది ఆయనకు కష్టం కలిగిస్తుంది. మీ సాఫల్యాన్ని ఆయన తీవ్రంగా కాంక్షిస్తాడు. విశ్వాసులపై ఆయన వాత్సల్యం కలవాడు. కారుణ్యం కలవాడు."**

*(అత్ తౌబా - 128)*

ఆలి ఇమ్రాన్ సూరాలో ఇలా చెప్పబడింది.

**"(ఓ ప్రవక్తా!) అల్లాహ్ కరుణాకటాక్షాల వల్లనే నీవు వారి పట్ల మృదు స్వభావుడవు అయ్యావు. నీవే గనక కర్కశుడవు, కఠిన హృదయుడవు అయితే వారందరూ నీ చుట్టు ప్రక్కల నుండి దూరంగా పోయేవారు."**

*(ఆలి ఇమ్రాన్ : 159)*

అల్లాహ్‌పై విశ్వాసం వల్ల హృదయాలలో ప్రేమ జనిస్తుంది. ప్రేమ ఉన్న హృదయంలో కాఠిన్యం ఉండదు. ఒక విశ్వాసి ఆపాద మస్తకం ప్రేమవాత్సల్యాలు మూర్తీభవించినవాడు, మృదు స్వభావుడూను. అన్యథా అతని విశ్వాసంలో 'మేలు' అన్నదే లేదనాలి. దీన్ని గురించి అల్లాహ్ ప్రవక్త (సఅసం) ఈ విధంగా సెలవిచ్చారు:

"విశ్వాసి ప్రేమ, వాత్సల్యాలు మూర్తీభవించినవానిగా ఉండాలి. ప్రేమించనివాడు, ఇతరులచే ప్రేమించబడని వానిలో మంచి అనేది లేదు." ఆయన ఇంకా ఇలా ప్రవచించారు :

"మృదుత్వానికి దూరం చేయబడినవాడు మంచికి దూరం చేయబడ్డాడు." (మిష్కాత్, ముస్లింలోని ఇబ్నె జరీర్ ఉల్లేఖనం).

"ఎవడికయితే 'మృదుత్వం' నుండి అతని భాగం ఇవ్వబడిందో అతనికి ఇహపరాల మేళ్ళలోని ఒక భాగం ఇవ్వబడినట్లే." (ఆయిషా - షర్‌హుస్సున్నహ్)

ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ఒకసారి ముగ్గురు స్వర్గవాసుల గురించి ప్రస్తావించి 'అందులో ఒకరు తన బంధువుల పట్ల ముస్లింపట్ల దయాగుణం, సహృదయం కలిగిన వాడని' అన్నారు. (ముస్లిం)

అల్లాహ్ దాసుల పట్ల దయాగుణం చూపనివాడు అల్లాహ్ కారుణ్యాన్ని పొందలేని అభాగ్యుడు. అల్లాహ్ దాసులపై దయ చూపినవానిపై అల్లాహ్ కారుణ్యం విధిగా వర్షిస్తుంది.

"కేవలం దౌర్భాగ్యుడైన వాని వద్ద నుండి తప్ప మరెవ్వరి వద్ద నుండి దైవకారుణ్యం లాక్కొనబడదు." (అబూహురైరా ఉల్లేఖనం - అహ్మద్ తిర్మిజి, మిష్కాత్)

"ఇంకా ఎవరు దయచూపుతారో వారిపై కరుణామయుని (అల్లాహ్) కారుణ్యం వర్షిస్తుంది. మీరు భూవాసులపై కనికరం చూపించండి, ఆకాశపు వాడు (అల్లాహ్) మీపై కారుణ్యం చూపుతాడు." (అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ కథనం - అబూదావూద్, తిర్మిజీ, మిష్కాత్)

ఈ దయాగుణం, మృదుత్వం అన్నది రెండు విధాలుగా ఉంటుంది - ఒకటి పెద్దవారి పట్ల గౌరవం, రెండోది చిన్నవారిపైన ప్రేమ, వాత్సల్యం.

ఈ విషయంలో ఇంకా ఇలా చెప్పబడింది : "చిన్నవారిపై ప్రేమ చూపనివారు, పెద్దలను గౌరవించనివారు మాలోని వారు కారు." (అబూ దావూద్, తిర్మిజి, మిష్కాత్)

ఒక ముస్లిం తన తోటివానితో మృదువుగా మెలగాలి. వ్యవహారాల్లో తోటి వానిని సంతోషపెట్టడానికి సాధ్యమైనంత వరకు ప్రయత్నించాలి. తోటి వానికి కష్టం కలుగకుండా చూడాలి. అతని ధర్మ సమ్మతమైన అవసరాన్ని పూర్తిచేయాలి. ఈ విషయాల్ని ముహమ్మద్ (సఅసం) ఒక ఉదాహరణ ద్వారా వివరించారు.

"విశ్వాసి సహనశీలుడుగా, మృదు మనస్సు కలవాడుగా ఉంటాడు. ఒక ఒంటె మాదిరిగా - ఒంటె ముక్కుకు తాడు వేయబడి ఉంటుంది. ఆ తాడును లాగితే లాగినకొద్దీ పరుగెత్తుతుంది. బండపై కూర్చుండబెడితే బండపై కూర్చుంటుంది." మృదు స్వభావాన్ని క్లుప్తంగా ఒక్క వాక్యంలో ఖుర్ఆన్ నొక్కి వక్కాణించింది.

**"వారు విశ్వాసుల యెడల మృదు స్వభావులుగా ఉంటారు." (అల్ మాయిద - 54)**

దయాగుణం, మృదుత్వం అనేవి మనిషి లక్షణాలలో చాలా ముఖ్యమైనవి. దీనివల్లనే సంబంధాలు సజీవంగా ఉంటాయి. దీనివల్ల సంబంధాలకు అందం వస్తుంది. ఇందలి మధురిమను ఆస్వాదించిన వ్యక్తి ఎప్పటికి కూడా దాన్ని విడిచిపెట్టడు.

## మన్నింపుల వైఖరి

అనగా క్షమించగలిగే గుణం, కాని ఇందులో వేరు వేరు విభాగాలైన - కోపంపై అదుపు, సహనం, మంచి మనస్సు అనే లక్షణాలు మన్నింపుల వైఖరితో దగ్గర సంబంధం కలిగి ఉండటం వలన వాటిని, కూడా ఇందులోనే చేర్చడం జరిగింది.

ఇద్దరు వ్యక్తుల మధ్య సంబంధాలు ఏర్పడి ఉన్నప్పుడు సహజంగానే ఒకరికి నచ్చని పని మరొకరు ఎప్పుడో ఒకప్పుడు చేయడం జరుగుతుంది. ఇలాంటి అనేక సందర్భాలు తలెత్తవచ్చు. ఫలితంగా ఒకరిపై ఒకరికి కోపం వచ్చే అవకాశము ఉంది. కొన్ని సందర్భాల్లో తోటివాని పనివల్ల నష్టపోయిన వ్యక్తికి పరిహారం పొందే హక్కు చట్టబద్ధంగా లభించవచ్చు.

ఇటువంటి సందర్భాల్లో ఆ వ్యక్తి విశాల హృదయంతో ప్రేమ, దయాగుణాలు ప్రదర్శించి క్షమించివేయడమే ప్రేమైక సంబంధాల ప్రత్యేకత. దైవప్రవక్త (సఅసం) ఈ విషయాన్ని ఎంతో ముఖ్యమైనదిగా భావించారు. దీని గురించి అల్లాహ్ దివ్య ఖుర్ఆన్‌లో పలుచోట్ల తన ప్రవక్తనుద్దేశించి ఇలా ఉపదేశించాడు : "(ఓ ప్రవక్తా!) వారిని మన్నించు", "వారిని పట్టించుకోకు", "వారిని క్షమించు".

ముస్లింలకు భయభక్తుల ప్రాముఖ్యాన్ని విశదీకరిస్తూ ఇలా అనబడింది :

**"వారు కోపాన్ని దిగమ్రింగేవారు. ఇతరుల తప్పులను క్షమించేవారు అయి ఉంటారు." (ఆలి ఇమ్రాన్ : 134)**

ఒక వ్యక్తికి కష్టం కలిగినప్పుడు లేదా ఏదైనా నష్టం సంభవించినప్పుడు అన్నిటికంటే ముందు కోపం తన్నుకు వస్తుంది. అలాంటి పరిస్థితిలో అతని చేష్టల వల్ల సంబంధాలు తీవ్రంగా దెబ్బతింటాయి. అందువల్ల మనిషి ముందు తన కోపం దిగమ్రింగాలి. అప్పుడు అతడు చల్లని మనస్సుతో విషయం అర్థం చేసుకోగలడు. అప్పుడు క్షమాగుణాన్ని ప్రదర్శించకున్ననూ కనీసం న్యాయపరిధిని దాటకుండా ఉండగలడు. ముహమ్మద్ (సఅసం) క్రోధాన్ని దిగమ్రింగాలని తమ ఆదేశాలలో నొక్కి చెప్పారు -

"ఎలాగైతే ముసాంబ్రపు ద్రవం తేనెను పాడు చేస్తుందో అలాగే క్రోధం మనిషి విశ్వాసాన్ని పాడుచేస్తుంది." (బైహఖీ - మిష్కాత్)

"అలాహ్ ప్రసన్నత పొందటానికి దాసుడు క్రోధాన్ని దిగమింగే గ్రుక్కకంటే ఉత్తమమైన గ్రుక్క అల్లాహ్ దృష్టిలో మరొకటి లేదు." (అహ్మద్, హసన్ ఇబ్నె ఉమర్ - మిష్కాత్)

అదేవిధంగా మహనీయ ముహమ్మద్ (సఅసం) సహనం కలిగి ఉండాలని ఉద్బోధించారు. ఉత్తమ నడవడిక ఏమిటంటే వ్యక్తి కష్టాల్లో సహనం వహించాలి. కలిసిమెలసి ఉండాలి. కాని సంబంధాలను తెగతెంపులు చేసుకోరాదు. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు : "కష్టాలలో సహనం వహించని, కలిసిమెలసి ఉండని ముస్లిం కంటే కష్టాలలో సహనం వహించి, ప్రజలతో కలసిమెలసి ఉండే ముస్లిం ఉత్తముడు." (ఇబ్నె ఉమర్ - తిర్మిజి, ఇబ్నె మాజా, మిష్కాత్)

ఒకసారి ప్రవక్త మహనీయులు (సఅసం) అబూబక్ర్ (రజి)నుద్దేశించి ఇలా బోధించారు :

"మనిషిపై దౌర్జన్యం జరిగితే అతడు అల్లాహ్ కొరకు సహనం వహించాలి. అందుకు బదులుగా అల్లాహ్ అతనికి ఎనలేని సహాయం చేస్తాడు." (బైహఖీ - అబూహురైరా)

సహనం కంటే ఉత్తమమయినది ఏమిటంటే వ్యక్తి తన తోటివానిని మనస్ఫూర్తిగా క్షమించాలి. అతడు కక్ష తీర్చుకునే శక్తి తన వద్ద ఉన్ననూ క్షమించాలి. ప్రవక్త ఇలా అన్నారు. 'మూసా (అ) అల్లాహ్‌ను ఈ విధంగా అడిగారు. "నీ దాసులలో నీ వద్ద మంచివారు ఎవరు?"

అల్లాహ్ ఇలా చెప్పాడు : "పగ తీర్చుకునే శక్తి కలిగి ఉండీ క్షమించువాడు."

అదేవిధంగా మనిషి తన తోటివాడు ఫలానా కారణం వల్ల నీ కిష్టంలేని పని చేశానని చెప్పినప్పుడు ఆ కారణాన్ని ఒప్పుకోక పోవడంపై హెచ్చరిక చేయబడింది.

"ఎవడయినా తన వల్ల జరిగిన తప్పుకుగాను తన సోదరునికి సంజాయిషీ ఇచ్చుకున్నప్పుడు, అతను ఆ సంజాయిషీని పరిగణనలోకి తీసుకోకపోయినా లేదా ఆ సంజాయిషీని ఆమోదించకపోయినా, అతను అక్రమంగా ధనం వసూలు చేసి పాపాన్ని మూటగట్టుకున్న వాడవుతాడు." (జాబిర్ (రజి) కథనం - బైహఖీ, మిష్కాత్)

"తన తోటివానిపై పగ తీర్చుకునే శక్తి ఉండీ తనను తాను అదుపు చేసుకున్నవాడు ప్రళయదినాన మంచి ప్రతిఫలం పొందుతాడు. ఆ రోజు అల్లాహ్ అతడ్ని పిలిచి అందరిముందు నిలబెడతాడు. తనకిష్టమైన హూర్ (స్వర్గకన్య)ను ఎంపిక చేసుకునే అవకాశమిస్తాడు." (తిర్మిజీ, అబూదావూద్)

ప్రపంచంలో క్షమించే వారిని అల్లాహ్ క్షమిస్తాడు.

**"వారిని క్షమించాలి, వారి (తప్పుల)ని ఉపేక్షించాలి. మిమ్మల్ని అల్లాహ్ క్షమించాలి అని మీరు కోరుకోరా? అల్లాహ్ గుణం ఏమిటంటే ఆయన క్షమించేవాడు కరుణించేవాడు."** *(నూర్ - 22)*

దౌర్జన్యానికి ప్రతీకారం తీర్చుకోవచ్చు. కాని దానిని క్షమించడం వల్ల అల్లాహ్ ఉత్తమ ప్రతిఫలం ప్రసాదిస్తాడు.

> **"చెడుకు ప్రతిక్రియ అదే రకమైన చెడు. కాని ఎవడయినా క్షమించి, రాజీపడితే దానికి ప్రతిఫలం ఇచ్చే బాధ్యత అల్లాహ్‌ది. అల్లాహ్ దుర్మార్గులంటే ఇష్టపడడు." (షూరా - 40)**

క్షమించడం అనేది మామూలు విషయం కాదు. క్షమా గుణం పెంపొందించుకోవడానికి పటిష్టమైన సంకల్పం అవసరం.

> **"ఎవడయినా సహనంతో వ్యవహరిస్తే, క్షమించివేస్తే అది సాహసంతో, దృఢ సంకల్పంతో కూడుకున్న పని." (షూరా - 41)**

ఈ సుగుణం సత్సంబంధాలను పటిష్టపర్చడంలో పవిత్ర పరచడంలో ముఖ్యపాత్రను పోషిస్తుంది.

ఇంకా రెండు విషయాల ప్రస్తావన కూడా ఇక్కడ అవసరం. అవి :

## పరస్పర నమ్మకం

పరస్పర సంబంధాల విషయమై ఖుర్ఆన్‌లో ఉపయోగించబడిన పదాల్లో నమ్మకం కూడా ఒకటి. తోటివానిపై నమ్మకం ఉన్నవాడే మంచి స్నేహితుడు. అలాంటి మనిషికి తోటివాడు లావాదేవీలను పూర్తి నమ్మకంతో అప్పగించగలడు. మనిషి తోటి వానిని పూర్తిగా నమ్మినప్పుడు సౌభ్రాత్ర సంబంధాలు ఏర్పడుతాయి. ఇలాంటి సంబంధాలలో మనిషి తన వ్యవహారాలలో తోటివాని పట్ల పూర్తి విశ్వాసంతో సర్వం అప్పజెప్పగలడు.

## విలువల స్పృహ

ఇది చివరిదే అయినప్పటికీ అతి ముఖ్యమైన గుణం మనిషి పరస్పర సంబంధాల ప్రాముఖ్యాన్ని, విలువను అర్థం చేసుకోగలగాలి. అప్పుడే అతడు ఇతరులతో

సంబంధాలకు ఎట్టి పరిస్థితిలో కూడా భంగం కలుగనీయడు. ఈ ప్రాథమిక విషయాల ఆధారంగా అల్లాహ్, దైవప్రవక్త (సఅసం) మనకు వివరంగా కొన్ని సూచనలిచ్చారు. వీటితో సంబంధాలను పటిష్టపరచుకోగలం. సత్సంబంధాలను దెబ్బతీసే కొన్ని చేయకూడని పనుల గురించి వారించారు. ఆ విధంగా సంబంధాలు చెడిపోకుండా కాపాడుకోగలము. అలాగే కొన్ని చేయదగిన పనుల గురించి సూచనలిచ్చారు. వీటితో సంబంధాలను మరింతగా పటిష్టపరచుకోగలము.

# చేయకూడని పనులలో ముఖ్యమైనవి

## హక్కులను కాజేయటం

ప్రతి వ్యక్తికి ప్రపంచంలో కొన్ని హక్కులున్నాయి. ఈ హక్కులు మనిషి తన సొంతానికి ఉపయోగించుకునే వస్తు సామగ్రిపై యాజమాన్య హక్కులు కావచ్చు, అలాగే మరికొన్ని మనిషికి మరో మనిషిపై ఉండే హక్కులు కావచ్చు. వీటివల్లనే మనిషి సత్సంబంధాలను ఏర్పరచుకుంటాడు. ఒక ముస్లిం యొక్క విధి ఏమిటంటే తన తోటివాని హక్కులలో దేనిని కూడా కబళించరాదు. సంపద, భూమి, ప్రాపంచిక లాభాలు ధన మాన ప్రాణాలకు సంబంధించిన హక్కులు, ధార్మిక హక్కులు పూర్తిగా అతనికి లభించేలా చూడాలి. ఈ హక్కులు పొందకుండా అతడిని అడ్డగించరాదు. ఈ హక్కుల గురించి దివ్య ఖుర్ఆన్ విపులంగా వివరించింది. వారసత్వ హక్కులు, నికాహ్, తలాఖ్ (వివాహం - విడాకులు) ఇంకా ఇతర వ్యవహారాల్లో అల్లాహ్ హద్దులను ఏర్పాటు చేసి ఆ హద్దులు మీరరాదని ఆదేశించాడు. హదీసులలో కూడా ఈ హక్కులు వివరించబడ్డాయి. ఈ హక్కులు ప్రస్తావించబడిన ప్రతీసారి హక్కుల విషయంలో హద్దు మీరడాన్ని కఠినంగా హెచ్చరించడం ఉంది. హద్దు మీరటం వలన వచ్చే ఉపద్రవం గురించి దాని శిక్ష గురించి వివరించటం జరిగింది.

**"ఇవి అల్లాహ్ విధించిన హద్దులు, వీటిని అతిక్రమించకండి. అల్లాహ్ విధించిన హద్దులను అతిక్రమించేవారే దుర్మార్గులు."**

*(అల్ బఖర - 229)*

ఇంకా ఇలా చెప్పబడింది :

**"ఇవి అల్లాహ్ విధించిన హద్దులు. అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయత చూపేవాణ్ణి అల్లాహ్, క్రింద సెలయేర్లు ప్రవహించే ఉద్యానవనాల్లో ప్రవేశింపజేస్తాడు. ఆ వనాలలో అతడు కలకాలం ఉంటాడు. అసలు ఇదే గొప్ప సాఫల్యం. అల్లాహ్‌ను ఆయన ప్రవక్తను తిరస్కరిస్తూ అల్లాహ్ విధించిన హద్దులను అతిక్రమించే వాణ్ణి అల్లాహ్ అగ్నిలో పడవేస్తాడు. అందులో అతడు సదా ఉంటాడు. అతనికి మిక్కిలి అవమానకరమైన శిక్ష పడుతుంది."** *(అన్ నిసా - 13, 14)*

"ప్రమాణం చేసి కూడా తోటి ముస్లిం హక్కు కాజేసిన వానికి అల్లాహ్ స్వర్గం నిషేధించాడు. అతనికి నరకాగ్ని తప్పనిసరి అవుతుంది" అని ప్రవక్త (స) ప్రవచించారు. అల్లాహ్ ప్రవక్త అనుచరులలో ఒకరు (రజి) ఈ విషయమై వివరణ కోరుతూ, 'ఒక చిన్న వస్తువును కాజేసినట్లయితే!' అని అడిగారు. జవాబుగా 'ఔను, పిప్పల చెట్టు యొక్క చిన్న కొమ్మను కాజేసినాసరే' అన్నారు ప్రవక్త.

ఒకసారి దైవప్రవక్త (సఅసం) సంబంధాల ప్రాముఖ్యాన్ని చక్కగా అర్థం అయ్యేలా చెప్పడానికి ఇలా అడిగారు. 'దరిద్రుడు ఎవరో మీకు తెలుసా?' అనుచరులు జవాబిస్తూ 'ఎవరి వద్దనైతే ధనధాన్యాలు లేవో అతడు దరిద్రుడు' అని అన్నారు. దానికి జవాబుగా ప్రవక్త, 'నా అనుచరులలో దరిద్రుడంటే ప్రళయదినం నాడు నమాజ్, రోజా, జకాత్ అనే సత్కర్మలతో పాటుగా ఇతరులను తిట్టడం, ఇతరులపై అపనిందలు మోపడం, ఇతరుల వస్తువులను కాజేయడం, రక్తపాతం సృష్టించడం, ఇతరులను కొట్టడం వంటి కర్మలను కూడా తెచ్చుకున్నవాడు అసలు దరిద్రుడు' అన్నారు. ఈ విధంగా అతని పుణ్యాలన్నీ బాధితులకు పంచబడతాయి. అతని కర్మలలో పుణ్యాలేవీ మిగలకపోతే బాధితుల పాపాలు అతనిపై వేయబడతాయి. తరువాత అతను అగ్ని గుండంలో నెట్టబడతాడు." (ముస్లింలో అబూ హురైరా ఉల్లేఖనం - మిష్కాత్)

ప్రపంచంలో సంబంధాలను కాపాడటానికి, ప్రళయదినాన శిక్ష నుండి రక్షించటానికి ఇతరుల హక్కులను నెరవేర్చడం అవసరం. అందుకొరకే ముహమ్మద్

(సఅసం) అన్నారు : "వ్యక్తి తన జీవితంలోనే తన తప్పులకు క్షమాపణ పొందాలి. హక్కుల విషయంలో ఒక ముస్లిం మాన ప్రాణాల హక్కులకు మాటలతోగాని, చేతలతో గాని భంగం కలిగించరాదు. ఇది మౌలిక విషయం. ప్రవక్త మహనీయులు దీన్ని ముస్లింల అవశ్య లక్షణంగా పేర్కొన్నారు. ముస్లిం సాటి ముస్లింల ధనప్రాణాలను తన చేతల ద్వారా, మాటల ద్వారా సురక్షితంగా ఉంచుతాడు." (బుఖారి, ముస్లిం)

## ప్రాణ రక్షణ

ప్రతి వ్యక్తి ప్రాణాలను అమితంగా ప్రేమిస్తాడు. ఈ విషయంలో ఇతరులు హద్దు మీరటం అసలు సహించడు. అందువల్ల ప్రాణాలపై దాడిని కఠినంగా ఖండించడం జరిగింది.

**"ఇక బుద్ధిపూర్వకంగా ఒక విశ్వాసిని చంపినవానికి ప్రతిఫలం నరకం. అందులో అతడు సదా ఉంటాడు. అతనిపై అల్లాహ్ ఆగ్రహం, శాపం అవతరిస్తాయి. అల్లాహ్ అతని కొరకు కఠినమైన శిక్షను సిద్ధపరచి ఉంచాడు."** *(నిసా : 93)*

ప్రవక్త (సఅసం) తన చివరి హజ్ సమయంలో ప్రసంగిస్తూ ఒక ముస్లిం ధన ప్రాణాలకు హాని కల్గించడం నిషిద్ధం అని అన్నారు. ఇంకా ఇలా సెలవిచ్చారు :

"నా తర్వాత మీరు తిరస్కారులుగా మారవద్దు. ఒండొకరి మెడలు నరుక్కోవద్దు."

మరో సందర్భంలో ఇలా అన్నారు :

"ఒక ముస్లింను తిట్టడం దేవుని హద్దులు మీరడంతో సమానం, ఒక ముస్లింతో కొట్లాడటం తిరస్కారం (కుఫ్ర్)తో సమానం. చేతి దెబ్బ కంటే నోటి వాటం చాలా హానికరమైనది. సంబంధాలలో నోటి మాట వేయి మార్గాల ద్వారా కల్లోలం (ఉపద్రవం) రేపుతుంది. ఈ ఉపద్రవాన్ని ఆపడం అంత తేలకైనది కాదు. అందువల్ల ఇటువంటి ఉపద్రవాలకు వెంటనే ఆనకట్ట వేయాలి. అల్లాహ్ మరియు దైవప్రవక్త ఈ విషయంలో నోటి (నాలుక) గురించి హెచ్చరించారు. సంబంధాల విషయంలో హానికరమైన అంశాలను విశదీకరించారు.

ఖుర్ఆన్ ఇలా తెల్పింది :

**"మనిషి నోటి నుండి వెలువడే ప్రతి మాటను రాయటానికి అనుక్షణం ఒక పరిశీలకుడు సిద్ధంగా ఉంటాడు."** *(ఖాఫ్ : 18)*

ముఆజ్ (రజి)ను ప్రవక్త (సఅసం) హెచ్చరిస్తూ, నాలుకను పట్టుకొని, 'దీన్ని ఆపి ఉంచడం నీ విధి' అని అన్నారు. దానికి ముఆజ్, 'ఓ దైవప్రవక్తా! మేము ఏదైతే అంటామో దాని గురించి అడుగబడుతుందా?' అని ప్రశ్నించారు.

"ఓ ముఆజ్ (రజి) నోటి కారణంగానే వ్యక్తులు అగ్ని గుండంలో వేయబడతారు!" అని ప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. సుఫ్యాన్ బిన్ అబ్దుల్లా (రజి) ఓసారి ప్రవక్త (సఅసం) ను 'నేను ఏ విషయంలో ఎక్కువ భయపడాలి' అని అడిగారు. జవాబుగా ముహమ్మద్ ప్రవక్త (సఅసం) తన నాలుకను పట్టుకుని "దీని గురించి" అన్నారు.

# దుర్భాషలాడటం

వ్యక్తి తన సోదరునితో దుర్భాష లాడటం అవహేళన చేయడం నిషిద్ధం. చెడు పేరుతో పిలవడం కూడా తప్పు.

**"ఒకరినొకరు చెడ్డ పేర్లతో పిలుచుకోకండి. విశ్వసించిన తర్వాత చెడ్డ తనంలో పేరు సంపాదించడం చాలా నీచమైన విషయం."** *(హుజురాత్ - 11)*

ప్రియప్రవక్త ఇలా సెలవిచ్చారు : "దుర్భాషి మరియు కఠినభాషి స్వర్గంలో ప్రవేశించలేడు." (అబూదావూద్, బైహఖీ)

ఇంకా ఇలా అన్నారు : 'వదరుబోతు, గొప్పతనం చాటుకునేవాడు, ఇతరుల మనస్సులను నొప్పించేవాడు, అబద్ధపు సాక్షి, గర్విష్టి ప్రళయ దినాన నా వద్ద అందరికంటే అయిష్టమైనవాడు.' (తిర్మిజి)

"విశ్వాసి - వ్యంగ్యంగా మాట్లాడడు, ఇతరులకు శాపనార్థాలు పెట్టడు. చెడు మాట్లాడడు. నోరు పారేసుకోడు" అని కూడా ప్రవక్త అన్నారు. వ్యక్తి తన తోటివాడిని అవమాన పరచరాదు. (తిర్మిజీ, ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం)

# పరోక్ష నింద

ఇది మరో ఉపద్రవం. ఇందులో వ్యక్తి తన తోటివాని ముందు కాకుండా అతడు లేనపుడు నిందిస్తాడు. కాబట్టి తోటివానికి సమాధానం చెప్పే అవకాశం ఉండదు. ఇలా నిందించడం మరణించిన సోదరుని మాంసం తినడంతో సమానంగా ఖుర్ఆన్ పేర్కొంది.

**"మీలో ఎవరూ ఎవరిని పరోక్షంగా నిందించరాదు. మీలో ఎవరైనా మీ మృత సోదరుని మాంసం తినటానికి ఇష్టపడతారా! చూడండి, మీరే స్వయంగా దీనిని అసహ్యించుకుంటారు." (హుజురాత్ - 12)**

ప్రవక్త (సఅసం) ఒకసారి ఇలా అడిగారు : "పరోక్ష నింద అంటే ఏమిటో తెలుసా?" దానికి సమాధానంగా సహచరులు (రజి) "అల్లాహ్ మరియు దైవప్రవక్తకే బాగా తెలుసు" అన్నారు. ప్రవక్త జవాబిస్తూ 'పరోక్ష నింద అంటే తన తోటివాడు నొచ్చుకునే విషయాన్ని అతని పరోక్షంలో చెప్పడం' అన్నారు. అతనిలో వాస్తవంగా ఆ లోపం ఉన్ననూ అది పరోక్ష నింద అవుతుందా? అని సహచరులు అడిగారు. ప్రవక్త మహనీయులు ఇలా అన్నారు : "అతనిలో లోపం ఉంటేనే అది పరోక్ష నింద లేకుంటే అది అభాండం (బుహ్తాన్) అవుతుంది." (ముస్లిం - అబూ హురైరా (రజి) కథనం) ఒక వ్యక్తి తన తోటివాడిని పరోక్షంగా నిందించకుండా ఉండాలి.

# చాడీలు చెప్పడం

పరోక్షనిందకు మరో రూపం చాడీలు చెప్పడం. ఈ చెడుగును గురించి దివ్య ఖుర్ఆన్ ఇలా అభివర్ణించింది.

**"వాడు ఎత్తిపొడుస్తూ ఉంటాడు. చాడీలు చెబుతూ తిరుగుతూ ఉంటాడు."**

*(అల్ ఖలమ్-11)*

చాడీలు చెప్పువాడు స్వర్గంలో ప్రవేశించడన్న ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని హజ్రత్ ఖదీజా (రజి) ఉటంకించారు.

మహాప్రవక్త (సఅసం) తమ సహచరులకు ఉపదేశిస్తూ ఇలా అన్నారు : 'ఇతరుల విషయాలు నా వద్ద విన్పించకండి. ఎందుకంటే వారితో కలిసేటప్పుడు నా మనస్సు నిర్మలంగా ఉండాలి.' (అబూ దావూద్ - ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం)

మాట ద్వారానే కాదు చేతులు, కళ్ళ ద్వారా, హావభావాలతో చాడీలు చెప్పడం జరుగుతుంది. దాని నుండి కూడా దూరంగా ఉండాలి.

## అవహేళన చేయడం

చెడుకు సంబంధించి అత్యంత నికృష్టమైన విషయం, మనుష్యుల మనసులలో ద్వేషం పెంపొందించే అంశం ఏమిటంటే వ్యక్తి తన తోటివాని ఎదుట లేదా పరోక్షంగా అతని తప్పులను ఎత్తిచూపిస్తూ అవహేళన చేయడం, అవమాన పరచటం. ఈ విధంగా అవహేళన చేయడం వల్ల మనిషి హృదయం రోదిస్తుంది. దివ్య ఖుర్ఆన్‌లో ఇలా సెలవీయబడింది -

**'ఒకరినొకరు ఎత్తి పొడుచుకోకండి.'** *(హుజురాత్ - 11)*

ప్రియ ప్రవక్త (సఅసం) ఒకసారి ఇలా అన్నారు - 'వ్యక్తి తన సోదరుని తప్పును ఎత్తిచూపిస్తూ అవహేళన చేసినట్లయితే ఆ తప్పు తాను చేయనంతవరకు అతడు మరణించడం.' (తిర్మిజి)

ఇబ్నె ఉమర్ (రజి) ఉల్లేఖించారు - ప్రియ ప్రవక్త (సఅసం) ముస్లింల ఎన్నో హక్కులను తెల్పి ఇంకా ఇలా అన్నారు - "వారి తప్పులను ఎత్తి చూపుతూ అవహేళన చేయకూడదు." (తిర్మిజి)

## అతిగా అనుమానించడం

తప్పును ఎత్తిపొడిచి చిన్నబుచ్చడం కంటే ముందు ఇంకొక చెడు ఉంది. అదేమిటంటే మనిషి తోటి వాని చెడులను తెలుసుకోవడానికి కూపీ లాగుతూ అతని వెంట తిరగడం, తన తోటివాని వ్యక్తిగత లోపాలను తెల్సుకోవడం. ఇది చాలా తుచ్ఛమైన విషయం. ఇలా కూపీ లాగడం సభ్య సమాజం ఒప్పుకోలేని విషయం. ఇలా కూపీ లాగే వ్యక్తి వద్ద సాధారణంగా పూర్తి సమాచారం రాబట్టే వనరులుండవు.

కనుక తనకు తెలిసిన అసంపూర్ణ సమాచారంతోనే తోటివాని పట్ల దురభిప్రాయం ఏర్పర్చుకుంటాడు. ఇలా చేయడం అకారణంగా అనుమానించడంతో సమానం. అందుకే దివ్య ఖుర్‌ఆన్ ఇలా అంటుంది -

**"గూఢచారులుగా వ్యవహరించకండి."** *(హుజురాత్ - 12)*

"తోటి సోదరుని తప్పులను చూపడానికి అతిగా అనుమానించడం పెద్ద తప్పు. ఇలా ఎవరైనా తన సోదరుని అవ్యక్త తప్పుల వెనుకబడినట్లయితే అల్లాహ్ అతని అవ్యక్త తప్పులను బహిర్గతం చేసివేస్తాడు. ఇదే జరిగినట్లయితే మనిషి ప్రపంచంలో పరాభవం పాలవుతాడు." (తిర్మిజీ - అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) కథనం)

# ఎగతాళి

నోటి యొక్క చెడులలో అతి ముఖ్యమైనది ఎగతాళి చేయడం. పరిహసించడం, ఈ పరిహాసంలో ఎదుటివాణ్ణి కించపరచడం జరుగుతుంది. ఇందులో తనను గొప్పగా ఇతరులను నీచంగా చూపడం జరుగుతుంది.

**"విశ్వాసులారా! పురుషులు ఇతర పురుషులను ఎగతాళి చేయకూడదు. వీరికంటే వారే శ్రేష్ఠులై ఉండవచ్చు. అలాగే స్త్రీలు ఇతర స్త్రీలను ఎగతాళి చేయకూడదు. వీరికంటే వారే శ్రేష్ఠురాండ్రయి ఉండవచ్చు."** *(అల్ హుజురాత్ - 11)*

ఎగతాళి చేసేవారి కొరకు ప్రళయదినాన స్వర్గం యొక్క ఒక ద్వారం తెరువబడుతుంది. 'అందులోకి ప్రవేశించండి' అని పిలువడం జరుగుతుంది. అతడు విచారంగా అటు వైపు వస్తాడు. ద్వారం దగ్గరికి రాగానే ఆ ద్వారం మూసివేయబడుతుంది. మళ్ళీ రెండవ ద్వారం తెరచి అదేవిధంగా చేయబడుతుంది. ఇదే విధంగా చేస్తూ చేస్తూ వేరే స్వర్గవాసి వచ్చేవరకు కొనసాగుతుంది. అప్పుడు రమ్మని పిలిచినా ఆ ద్వారం గుండా స్వర్గ ప్రవేశానికి ఇతడు ధైర్యం చేయడు.

ఎగతాళిలో ఇతరుల చేష్టలను అనుకరించడం కూడా ఒకటి. ఒకసారి హజ్రత్ ఆయిషా (రజి) ఎవరిదో ఒకరి చేష్టను అనుకరించారు. అప్పుడు ముహమ్మద్ ప్రవక్త

(సఅసం) ఇలా అన్నారు : 'ప్రపంచంలో ఎంతటి విలువైన వస్తువు నాకు ఇచ్చినాసరే ఇతరుల చేష్టలను అనుకరించడం నేను చేయను' అటూ నిరసన తెలిపారు. (తిర్మిజి)

## అల్పునిగా భావించడం

తన తోటివాడిని నీచంగా భావించినప్పుడే వ్యక్తి తన తోటివాడిని తిట్టడం, ఎగతాళి చేయడం ఎత్తిపొడవడం, చాడీలు చెప్పడం, నిందించడం జరుగుతుంది. వ్యక్తి తన సోదరుణ్ణి ఉన్నతుడిగా భావించినప్పుడు ఇలా జరుగదు. అందుకొరకు ఖుర్ఆన్ ఇలా అంటుంది - వ్యక్తి ఇతరులను తన కంటే ఉత్తమమైన వారిగా భావించినట్లయితే అతడు ఇతరులను పరిహసించడు.

దైవవిశ్వాసం మరియు భయభక్తులు గల వ్యక్తి తన తోటివాడిని ఎప్పుడు కూడా నీచంగా భావించడు. ఎందుకంటే భయభక్తులే గొప్పతనానికి గీటురాయి. అతని లెక్క తీర్పుదినం నాడు ప్రభువు ఎదుట జరుగుతుంది. అందువలన ప్రపంచంలో ఇతరులను నీచంగా భావించేవాడు విశ్వాసం ధ్యేయాన్ని అర్థం చేసుకోలేదని భావం.

"ఒక మనిషి దుష్టుడు అనబడటానికి అతను సాటి వ్యక్తిని అల్పుడుగా భావించటం ఒక్కటి చాలు." (ముస్లిం, అబూ హురైరా)

ఇంకోసారి మహాప్రవక్త (సఅసం) ఇలా చెప్పారు - "ఒక ముస్లిం ఇంకొక ముస్లింను పరిహసించకూడదు. అతన్ని కించపరచకూడదు." ఇంకోసారి ఇలా అన్నారు: "ఎవరి హృదయంలోనైతే రవంత గర్వం ఉందో అతడు స్వర్గంలో ప్రవేశించలేడు." గర్వంను ఇలా విశదీకరించారు - గర్వం అంటే ఇతరుల హక్కులను కాజేయడం, ఇతరులను నీచంగా భావించడం. (ముస్లిం - ఇబ్నె మసూద్).

అబూ హురైరా (రజి) ఒక హదీసులో మూడు ముక్తికి సంబంధించిన విషయాలను, మూడు నాశనము చేసే విషయాలను తెల్పుతూ - "ఒక వ్యక్తి తనను తాను నాశనము చేసుకోవడానికి ఇతరులను తక్కువగా భావించి తనను గొప్పగా భావించడానికంటే వేరే కారణం అవసరం లేదు" అన్నారు. (బైహఖీ)

నేటి సమాజంలో అందరూ ఈ విషయాన్ని అర్థం చేసుకోవలసిన అవసరము ఉన్నది.

# చెడు తలంపు

సత్సంబంధాలను చెడగొట్టడంలో సత్సంబంధాలకు చెదలు పట్టించడంలో చెడు తలంపు కూడా ఒకటి. ఒక ముస్లిం ఎలాంటి రుజువులు లేకుండా తోటివాణ్ణి చెడుగా భావించినట్లయితే అక్కడి నుండి ప్రేమాభిమానాలు సెలవు తీసుకుంటాయి.

**"విశ్వాసులారా! అతిగా అవమానించకండి - కొన్ని అనుమానాలు పాపాలవుతాయి."** *(అల్ హుజురాత్ - 12)*

మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు : "మీరు చెడు తలంపునకు దూరంగా ఉండండి. ఎందుకంటే చెడు తలంపు నీచమైన అబద్ధం." (బుఖారీ, ముస్లిం - అబూ హురైరా (రజి) కథనం)

చెడు తలంపునకు దూరంగా ఉండాలంటే వ్యక్తి తన తోటివాని గురించి చెడుగా తలంచరాదు. చెడుగా చెప్పరాదు. ఎందుకంటే మనస్సులో ఉండే భావాలు వాస్తవాలు కాకపోవచ్చు. ఇవి ఊహలు మాత్రమే. కొన్ని విషయాలను దృష్టిలో ఉంచుకుంటే చెడు తలంపు నుండి రక్షించుకోవచ్చు.

(1) మొదటి విషయమేమిటంటే వ్యక్తి తాను ఇతరుల గురించి చెడు తలంపు చేయనట్లే ఇతరులు కూడా తన గురించి చెడుగా భావించే అవకాశమివ్వకూడదు. సాధ్యమైనంత వరకు ఇటువంటి అనుమానానికి తావు లేకుండా మసలుకోవాలి. లేకుంటే ఇతరులు చెడు తలంపుల ఉపద్రవంలో ఇరుక్కుంటారు. దీనికి ప్రవక్త జీవితంలోని ఒక ఉదాహరణ - ఒకసారి ప్రియ ప్రవక్త (సఅసం) ఏతెకాఫ్‌లో (అంటే కొంతకాలం పాటు మస్జిదులో దీక్షబూని ఉండడం) ఉన్నారు. రాత్రి వారి భార్యలలో ఒకరు ప్రవక్తతో మాట్లాడటానికి వచ్చారు. ఆమెను ఇంటికి పంపటానికి ప్రియప్రవక్త తోడు బయలుదేరారు. మార్గంలో ఇద్దరు అన్సార్ సహచరులు ప్రవక్త (సఅసం) ను కల్సుకోవడానికి వచ్చారు. కాని ఇది సరియైన సమయం కాదని వారు వెనుదిరిగారు. అప్పుడు ప్రియప్రవక్త (సఅసం) వారికి సందేహం రాకుండా ఉండటానికి వారిని పిలిచి 'ఈమె నా భార్య' అని అన్నారు. దానికి జవాబుగా వారు - 'ఓ దైవప్రవక్తా! మీ గురించి ఎవరైనా చెడు తలంపు చేయగలరా?' అన్నారు. దానికి సమాధానంగా ప్రవక్త (సఅసం) 'షైతాన్ మనిషిలో రక్తంలా ప్రవహిస్తుంటాడ'ని సెలవిచ్చారు.

(2) రెండవ విషయం ఏమిటంటే, అప్రయత్నంగా ఒకరి గురించి చెడు తలంపు వస్తే హృదయం నుండి దానిని వెంటనే తొలగించుకోవాలి. లేకుంటే అది అవినీతి అవుతుంది. ఎవరి గురించయితే చెడు తలంపు వచ్చిందో అతనికి ముందుగా తెలియజేయాలి. ఆ వ్యక్తి కూడా దాని గురించి తన నిర్దోషిత్వం తెలియజేసి హృదయంలో మలినం మిగలకుండా చేయాలి. అలాకాక మౌనంగా ఊరుకోవడం వల్ల అతడు కూడా చెడు తలంపుల పాపానికి గురికావచ్చు.

## అభాండం

ఒక ముస్లిం కావాలని తన తోటివానిని దోషిగా నిలబెట్టడం, చేయని నేరాన్ని అతనిపై మోపడాన్ని అభాండం అనవచ్చు. ఇది పూర్తిగా ఒక రకమైన అబద్ధం. దీని ఒక హీన స్వరూపం ఏమిటంటే వ్యక్తి తన పాపాన్ని ఇతరులపై వేయడం, దీని గురించి దివ్య ఖుర్ఆన్ ఇలా వివరించింది.

**"ఎవడైనా ఏదైనా నేరంగాని, పాపం గాని చేసి ఆ నిందను ఏ నిర్దోషిపైనైనా మోపితే అతడు తీవ్ర అపనిందను ఘోర పాతకాన్ని మూటగట్టుకుంటాడు."**

*(అన్ నిసా - 112)*

**అభాండం గురించి ఇంకా ఇలా చెప్పబడింది : "ఏ తప్పూ చేయని విశ్వాసులైన స్త్రీ, పురుషులకు మనస్తాపం కలిగించేవారు, ఒక పెద్ద అభాండభారాన్ని, ఒక స్పష్టమైన పాప భారాన్ని తమ తలపై మోపుకున్నట్లే."**

*(అహ్‌జాబ్ - 58)*

ప్రేమాభిమానాలతో కూడుకున్న సంబంధాలున్నచోట ఇలాంటి అపనిందలు ఉంటాయా?

## గాయపరచటం

వ్యక్తి తన తోటివానిని మానసికంగా గాని, శారీరకంగా గాని గాయపరచడం చేయకూడదు. ప్రియ ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "సాటి విశ్వాసిని బాధించేవాడు, లేదా అతనికి వ్యతిరేకంగా పన్నాగం పన్నేవాడు శాపగ్రస్తుడు." (తిర్మిజీ - అబూబకర్ సిద్దీఖ్ (రజి) కథనం)

ఆయన (సఅసం) ఈ విధంగా కూడా ప్రవచించారు : అల్లాహ్ అతన్ని

బాధకు లోను చేస్తాడు, ఎవడయితే ఒక ముస్లింను కష్టాల పాలు చేస్తాడో అల్లాహ్ అతన్ని కష్టాలపాలు చేస్తాడు." (ఇబ్ను మాజ, తిర్మిజీ)

## కష్టపెట్టడం

ఒక ముస్లిం తన తోటివానికి మనస్తాపం కలిగించటం భరించరాని విషయం. ఒక మనిషిని మరో మనిషి కష్టపెట్టే విషయాలు అనేకం ఉండవచ్చు. నిత్య జీవితంలోని చిన్న చిన్న విషయాలే కాక ప్రవర్తనా ధోరణి ప్రవృత్తి కూడా ఇతరులను కష్టపెట్టేదిగా ఉండవచ్చు. మనిషి తన మాటల ద్వారా, చేతల ద్వారా తోటివాని హృదయానికి కష్టం కలిగించకుండా ఉండాలి. అతని మనోభావాలను గాయపరచరాదు.

చాడీలు చెప్పడం అనేది అతి పెద్ద నేరం. దీని వెనుక కూడా మనిషిని కష్టపెట్టే ధోరణి ఉంటుంది. ఎందుకంటే చాడీలు చెప్పడం అంటే తోటివాని మనస్సు గాయపడేలా మాట్లాడటమే. అందుకే ముహమ్మద్ ప్రవక్త (సఅసం) అన్నారు : "ముగ్గురు వ్యక్తులు ఒక ప్రదేశంలో కూర్చున్నప్పుడు ఇద్దరు పరస్పరం గుసగుసలాడకూడదు. అనేకమంది అక్కడ చేరుకోనంతవరకూ వారలా చేయరాదు. ఎందుకంటే అతని (మూడోవ్యక్తి) మనసు నొచ్చుకోవచ్చు)" (ముస్లిం).

ఇస్లాం ఈ విషయంలో ఇచ్చే సూచనల జాబితాలను గమనించినట్లయితే తోటివాని హృదయాన్ని గాయపర్చకుండా ఉండటం అనేది ఒక ముఖ్యమైన అంశంగా కనబడుతోంది. తోటివాని హృదయాన్ని గాయపర్చడం అనేది ఇహపర లోకాల చెడుకు కారణమవుతుంది. దైవప్రవక్త (సఅసం) అన్నారు – "ఎవరైతే ఒక ముస్లింను బాధించాడో అతడు అల్లాహ్‌ను బాధించాడు." (తిబ్రానీ)

దీనికి భిన్నంగా తోటివానిని సంతోషపరచడం గురించి ఇలా చెప్పబడింది : "ఎవరైతే ఒక ముస్లిం అవసరాన్ని తీర్చడంలో ముందుండి అతడు సంతోషపడేలా చేస్తాడో, అతను నన్ను (ప్రవక్త – సఅసం) సంతోషపెట్టినట్లు, నన్ను సంతోషపెట్టినట్లయితే అది అల్లాహ్‌ను సంతోషపెట్టినట్లే. ఎవరైతే అల్లాహ్‌ను సంతోషపెడతాడో, అతనికి అల్లాహ్ స్వర్గంలో ప్రవేశం ఇస్తాడు." ఇక్కడ ప్రియప్రవక్త (సఅసం) ప్రవచనం

ఒకటి జ్ఞాపకముంచుకోవాలి. అదేమిటంటే, విశ్వాసి ప్రేమ స్వరూపుడు అయి ఉండాలి. ప్రేమ, వాత్సల్యాలు ప్రదర్శించనివారు, ఇతరుల ప్రేమాభిమానాలు పొందనివారు మంచి ఏ కోశానా లేనివారని అనవచ్చు. నవ్వులాటకు కూడా ఇతరుల మనసు నొప్పించడం తగదు. ఎందుకంటే దీనివల్ల ఎదుటి వ్యక్తి హృదయం గాయపడి, నొచ్చుకుంటాడు.

ఒకసారి ప్రవక్త మహనీయులు, తమ అనుచరులతో రాత్రి సమయంలో ప్రయాణం చేస్తున్నారు. ఒక ప్రాంతంలో విడిది చేశారు. ఆ సమయంలో ఒకరు సహ ప్రయాణీకుని త్రాడు దాచివేసారు. అతన్ని కష్టపెట్టారు. ప్రియ ప్రవక్త (సఅసం) దానిపై ఇలా సెలవిచ్చారు : "ముస్లిం ఇంకొక ముస్లింను వేళాకోళానికి కష్టపెట్టడం కూడా ధర్మసమ్మతం కాదు." (అబూదావూద్) ఇలాగే ఒకసారి ఆయుధం దాచితే దానిని వారించారు. పరిహాసం కోసం లేదా పరిహాసం లేకుండా ఒక ముస్లిం వస్తువును మరొకరు దాచితే అతనిని వారించాలి.

## అసూయ

అసూయ చాలా భయంకరమైన వ్యాధి. ఇది ఎవరి హృదయంలో చోటు చేసుకుంటుందో అతని హృదయంలో సంబంధాలనే కాక దైవ విశ్వాసాన్ని కూడా ప్రమాదంలో పడవేస్తుంది. తోటివారికి దైవమిచ్చిన వరాలు అనగా విద్యాజ్ఞానాలు అందచందాలు, నేర్పరితనము, సంపద మొదలైన వాటిని భరించలేకపోవడం, ఈ వరాలను అతడు కోల్పోవాలని కోరుకోవడం, ఇతరుల వరాలను లాక్కోవాలని ఆ వరాలు తనకు చెందాలనే దురాశ కలిగి ఉండటం అసూయ. అసూయకు కారణాలు కపటత్వం, వ్యక్తిగత గర్వం, ఇతరులను నీచంగా భావించడం, ఇతరులు తనకు తలవంచాలనే అహం మొదలగునవి.

అసూయ గురించి దైవప్రవక్త (సఅసం) ఇలా హెచ్చరించారు – "మిమ్మల్ని మీరు అసూయ నుండి కాపాడుకోండి. ఎందుకంటే అగ్ని కలపను తిన్నట్లు అసూయ సత్కర్మలను తినివేస్తుంది." (అబూదావూద్). కావున అసూయకు దూరంగా ఉండండి. ఇంకా ఈ విషయాన్ని గురించి ఖుర్ఆన్ ఇలా వివరించింది. "నేను అసూయపరుడు

అసూయ పడినప్పటి కీడు నుండి (నా ప్రభువు శరణు వేడుతున్నాను). అనుమానించకండి, వ్యాపార లావాదేవీలలో కీడు చేయకండి. అసూయకు లోనుకాకండి. ద్వేషించుకోకండి. ఇతరులతో సంబంధాలను త్రెంచుకోకండి. దురాశకు లోనుకాకండి. అల్లాహ్ దాసులారా! సోదర భావముతో జీవించండి." (బుఖారీ, ముస్లిం - అబూ హురైరా (రజి) కథనం) - సుప్రసిద్ధ హదీసు వ్యాఖ్యాత హాఫిజ్ ఇబ్నె హజర్ అస్ఖలాని ఏమన్నారంటే ఇలా చేయరాదని చెప్పినవి మనము విడిచినట్లయితే సోదరభావం పెంపొందుతుంది. మహాప్రవక్త (సఅసం) అసూయ ద్వేషాలను గురించి ఇంకా ఇలా వివరించారు - 'మునుపటి సమాజాలలో ఉన్న వ్యాధులు మీకు సంక్రమించినవి. అవి అసూయ ద్వేషాలు, ఇవి మిమ్మల్ని క్షవరం చేస్తాయి. మీ శిరోజాల ముండనం చేస్తాయని నేనటం లేదు, అవి మీ ధర్మాన్నే క్షవరం చేసేస్తాయి." (అహ్మద్, తిర్మిజీ)

ఈ విషయాల నుండి దూరంగా ఉంటూ సంబంధాలను పటిష్టంగా ఉంచుకొనుటకు అప్రమత్తంగా ఉండాలి. సంబంధాలను పటిష్ఠపరచడంలో తోడ్పడే ఇంకా అనేక విషయాలను కూడా అల్లాహ్ మరియు ప్రియప్రవక్త (సఅసం) బోధించారు. వీటిని పాటించడం వల్ల ప్రేమా వాత్సల్యాలు పెంపొంది హృదయాలు చేతి వ్రేళ్లవలే దగ్గర అవుతాయి. ఇందులో కొన్ని విషయాలు హక్కుల మాదిరిగా తప్పనిసరి అయినవిగా ఖరారు చేయబడినవి. కొన్ని సూచనలుగా ఇవ్వబడినవి. అల్లాహ్ ఆదేశాలు మరియు ప్రియప్రవక్త (సఅసం) జీవిత చరిత్ర నుండి తీసుకోబడిన కొన్ని విషయాలు ఇక్కడ పొందుపరిచాము. ఇందులోని ప్రతి విషయం ప్రేమైక సంబంధాల కొరకు అత్యవసరము.

## మానమర్యాదల పరిరక్షణ

ఒక వ్యక్తికి అన్నింటికంటే విలువైన వస్తువులు అతని గౌరవ మర్యాదలు. మానాభిమానాలపై దాడిని మనిషి ఎట్టి పరిస్థితిలోనూ సమ్మతించడు. అందువల్ల ముస్లిం తన తోటివాని మానాభిమానాలను దెబ్బతీయరాదని హెచ్చరించబడింది. ముస్లిం తన తోటివాని గౌరవ మర్యాదలను రక్షించాలని చెప్పబడింది. ఎక్కడైనా తోటివాని గురించి ఎవరైనా చెడుగా చెబుతుంటే లేదా అతనిపై అభాండాలు వేస్తుంటే ఒక ముస్లిం దానిని ప్రతిఘటించాలి. తన గౌరవమును కించపరిస్తే ఎలా ఎదుర్కొంటాడో అదేవిధంగా ఎదుర్కోవాలి. తన గురించి బాధపడినట్లే బాధపడాలి. ఈ విధంగా ఒక

వ్యక్తికి మరొక వ్యక్తి వల్ల గౌరవ మర్యాదలకు రక్షణ లభిస్తుందన్న నమ్మకం కలిగితే అతడు ఆ వ్యక్తిని హృదయపూర్వకంగా ప్రేమిస్తాడు.

ఈ విషయమై ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు : ఒక ముస్లిం మానాభిమానాలపై దాడి జరుగుతున్నప్పుడు అతనిని రక్షించడానికి ముందుకు రాని ముస్లిం తాను స్వయంగా అలాంటి సంక్లిష్ట పరిస్థితిలో చిక్కుకుని ఎవరైనా రక్షిస్తే బాగుండునని భావించినప్పుడు అల్లాహ్ అతడికి సహాయపడడు. అదేవిధంగా ఒక ముస్లిం గౌరవ మర్యాదలు కాపాడటానికి ముందుకొచ్చిన ముస్లింనకు అలాంటి అవసర పరిస్థితి ఏర్పడినప్పుడు అల్లాహ్ తప్పక సహాయపడతాడు. (అబూదావూద్, మిష్కాత్ - అబూ జాబిర్ కథనం).

అల్లాహ్ చేసే అత్యంత పెద్ద సహాయం ఏమిటంటే మానవులను ఆయన అగ్ని నుండి రక్షిస్తాడు. ఈ విషయమై, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా ప్రవచించారు- "ఒక ముస్లిం సాటి ముస్లిం గౌరవ మర్యాదలు మంటగలపకుండా ఎవరినయినా ఆపితే అల్లాహ్ అతన్ని అగ్ని నుండి రక్షిస్తాడు అంటూ క్రింది ఆయత్ పఠించారు. ముస్లింలకు సహాయం చేయడం మా విధి." (షరహుస్సున్న, అబూదర్దా)

ఒకరి గౌరవమర్యాదలను దెబ్బతీయడం కోసం చాడీలు చెప్పటం మరో చెడు. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు - ఎవరి ముందైతే సాటి ముస్లిం సోదరుని గురించి చాడీలు చెప్పబడుతున్నాయో, ఆ వ్యక్తి సహాయం చేసే శక్తి గలవాడైఉండి, సహాయం చేసినట్లయితే అల్లాహ్ ఇహపరలోకాల్లో అతనికి సహాయం చేస్తాడు. సహాయం చేసే శక్తి ఉండి కూడా సహాయం చేయనట్లయితే ఇహపరలోకాల్లో అల్లాహ్ అతన్ని పట్టుకుంటాడు. (మిష్కాత్, అనస్ కథనం, షరహుస్సున్న)

తోటివాడిని ఇతరులు కలిగించే నష్టం నుండి రక్షించడం గురించి ప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు - ఒక ముస్లిం తన తోటి విశ్వాసిని ఒక కపటి యొక్క కీడు నుండి రక్షిస్తే అతని కొరకు అల్లాహ్ ఒక దైవదూతను నియమిస్తాడు. ఆ దైవదూత ప్రళయం నాడు అతని శరీరాన్ని అగ్ని నుండి రక్షిస్తాడు. (అబూదావూద్, మిష్కాత్)

సాటి సోదరునికి సహాయపడడం అన్న బాధ్యత ఒక ముస్లింపై అనేక విధాలుగా ఉంటుంది. ధన సహాయం, కష్టాలలో ఆదుకోవడం, సమస్యలను పరిష్కరించడం ఇంకా ఎన్నో రకాలయిన ధార్మిక, భౌతిక అవసరాలను తీర్చడం – ఇవన్నీ చట్టపరంగా చేయవలసిన అవసరం లేకపోయినా ఉపకార గుణానికి సంబంధించి అతి ముఖ్యమైనవి. అత్యవసరమైనవి. వీటి గురించి ప్రళయదినాన ప్రశ్నించడం జరుగుతుంది. ఆకలిగొన్న వానికి అన్నం పెట్టే, దుస్తులు లేని వారికి బట్టలు పెట్టి లేదా తోటివాని సమస్యలు పరిష్కరించడంలో సహాయపడగలిగే, తోటివాని అవసరాన్ని తీర్చగలిగే, ఆర్థిక ఇబ్బందిని దూరం చేయగలిగే శక్తి ఉన్న ఒక ముస్లిం తప్పనిసరిగా ఆ పని చేయాలి. లేకుంటే అల్లాహ్ ప్రళయదినాన ఈ విషయాలలో ఒక్కొక్క దాన్ని తెలిపి ఇది ఎందుకు చేయలేదో జవాబు ఇవ్వమంటాడు. దైవప్రవక్త (సఅసం) తమ ప్రియ పలుకులతో ఇలా చెప్పారు – "అల్లాహ్ ఇలా అంటాడు : ఓ దాసుడా! నేను ఆకలితో ఉన్నప్పుడు నీవు అన్నం ఎందుకు పెట్టలేదు? నాకు దుస్తులు లేనప్పుడు బట్టలు పెట్టలేదు ఎందుకు? నేను రోగగ్రస్తుణ్ణై ఉన్నప్పుడు పరామర్శించలేదెందుకు? ఆ సమయంలో మనిషి వద్ద ఎలాంటి సమాధానము ఉండదు. తోటివానిని అవసరానికి ఆదుకోవడం, సహాయపడడం చాలా పెద్ద పుణ్యకార్యం. ఇలా చేసే చిన్న పనుల ద్వారా మనిషి పెద్ద స్థానాన్ని పొందుతాడు. తోటి వానికి సంతోషం కలుగజేసే ధ్యాసతో మనిషి వ్యవహరించాలి. తోటివానికి సహాయపడిన ముస్లిం అల్లాహ్ సహాయానికి అర్హుడు అయిపోతాడు. దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు – "ఒక దాసుడు ఇతర దాసునికి సహాయం చేస్తున్నంత వరకు అల్లాహ్ అతనికి సహాయం చేస్తుంటాడు." (ముస్లిం, తిర్మిజి – అబూ హురైరా కథనం)

ఇదే హదీసులో సహాయం గురించి విభిన్న కోణాలను తెలుపుతూ దానికి లభించే పుణ్యం గురించి ఇలా విశదీకరించారు : ఎవరయినా ఒక ముస్లిం తోటి విశ్వాసి ప్రాపంచిక సమస్యల్లోని ఒక సమస్యను పరిష్కరిస్తే అల్లాహ్ ప్రళయదినాన ఇతని కష్టాల నుండి ఒక కష్టాన్ని దూరం చేస్తాడు. లేమితో బాధపడుతున్న వ్యక్తికి సౌకర్యం కలిగిస్తే ఇహపరలోకాల్లో అల్లాహ్ అతనికి సౌకర్యం కలిగిస్తాడు. ఇంకా ఎవరైతే తోటి ముస్లిం సోదరుని తప్పులను మరుగుపరుస్తాడో అల్లాహ్ అతని తప్పులను ఇహపరలోకాల్లో (తప్పులను) కప్పి ఉంచుతాడు. (అబూహురైరా కథనం – ముస్లిం)

ఇంకో హదీసులో ఇలా చెప్పబడింది :

ఒక ముస్లిం ఇంకొక ముస్లింకు సోదరుడు. కనుక అతడు తన సోదరునిపై దౌర్జన్యం చేయకూడదు. అతనికి సహాయం చేస్తున్న చేతులను ఆపి నష్టం ఊబిలో పడేయరాదు. ఎవరైతే తన సోదరుని అవసరాన్ని తీరుస్తాడో, దుఃఖాన్ని దూరం చేస్తాడో, లేదా అతని కష్టాన్ని దూరం చేస్తాడో అల్లాహ్ ప్రళయదినాన అతని కష్టాల్లోని ఏదేని కష్టాన్ని దూరం చేస్తాడు." (బుఖారీ, ముస్లిం – ఇబ్నె ఉమర్ కథనం) ధన సహాయం అనేది సత్ప్రవర్తనలో ముఖ్యమైనది. లేని వ్యక్తికి ఉన్న వ్యక్తి సహాయం చేయాలి. దివ్య ఖుర్ఆన్‌లో ఇలా ఉంది : "వారి సంపదలలో అడిగే అభాగ్యులకు, అడగని అభిమానధనులకు ఒక నిర్ణీతమైన హక్కు ఉంటుంది." ఈ విషయాన్నే ప్రవక్త మహనీయులు ఈ విధంగా వివరించారు : 'సర్వ ప్రాణులు దేవుని కుటుంబం, ఎవరైతే ఈ కుటుంబం పట్ల మంచి ప్రవర్తన కలిగి ఉంటాడో అతడు అల్లాహ్‌కు అత్యంత ప్రియుడు.'

ఆకలితో ఉన్నవారికి అన్నం పెట్టడాన్ని దివ్య ఖుర్ఆన్ చాలా ప్రాధాన్యతనిస్తుంది. మక్కాలో అవతరించిన సూరాలలో ఈ విషయం ఎక్కువగా ప్రస్తావించబడింది. మదీనా వలస వచ్చిన తర్వాత ప్రియప్రవక్త తన తొలి ప్రసంగంలో చెప్పిన నాలుగు విషయాలలో ఒకటి 'మీరు అన్నం పెట్టండి, తర్వాత మీరు స్వర్గంలో ప్రవేశిస్తారు' అన్నది.

ఇంకా ఇలా చెప్పారు : "పొరుగువారు ఆకలితో ఉండగా, కడుపు నిండా తినేవాడు విశ్వాసి కాడు." (బైహఖీ, ఇబ్నె అబ్బాస్ కథనం, మిష్కాత్) ఒక వ్యక్తి ప్రియ ప్రవక్తను తన హృదయ కాఠిన్యమునకు విరుగుడు చెప్పవలసిందిగా కోరాడు. దానికి సమాధానంగా దైవప్రవక్త ఇలా అన్నారు : 'అనాథ తలను ఆప్యాయంగా నిమురు. నిరుపేదకు అన్నం పెట్టు.' (అహ్మద్, మిష్కాత్, అబూ హురైరా కథనం)

ఫిర్యాదుదారునికి సహాయపడటం కూడా ఒక విధమైనటువంటి సహాయమే. ప్రియప్రవక్త (సఅసం) ప్రవచించారు – ఫిర్యాదుదారునికి సహాయము చేస్తే అల్లాహ్ అతని కొరకు డెబ్బై మూడు క్షమాపణలు లిఖిస్తాయి. ఒక క్షమాపణ వల్ల అతడి

ప్రాపంచిక కర్మల తప్పులు తొలుగుతాయి. మిగతా డెబ్బయి రెండు క్షమాపణలు ప్రళయదినాన అతని అంతస్తును ఉన్నతం చేస్తాయి. (బైహఖీ-అనస్ (రజి) కథనం). అవసరమున్న వారికి సిఫారసు చేయడం, అవసరం తీర్చడం కూడా సహాయంలో ఒక భాగం.

ఇది మంచి కోసం అయి ఉండాలి. దివ్య ఖుర్ఆన్ ఇలా ప్రస్తావించింది. 'ఎవరైతే మంచి విషయం కొరకు సిఫారసు చేస్తారో, అతనికి కూడా ఆ మంచిలో భాగస్వామ్యం లభిస్తుంది (నిసా). ప్రవక్త మహనీయుల వద్దకు ఎవరైనా అవసరమున్న వ్యక్తి అవసర నిమిత్తం వచ్చినట్లయితే అనుచరులతో ఇలా అనేవారు : 'ఇతని కొరకు సిఫారసు చేయండి – పుణ్యంలో పాలుపంచుకోండి.'

సహాయానికి సంబంధించిన వివిధ దశలను, రకాలను ప్రవక్త (సఅసం) హజ్రత్ అబూజర్ గప్ఫారికి (రజి) వివరించారు. 'అబూజర్ (రజి) ఇలా అడిగారు: 'దైవ విశ్వాసంతో పాటు ఆచరణను తెలుపండి, దైవప్రవక్తా!' ప్రవక్త దానికి సమాధానంగా 'అల్లాహ్ ఇచ్చిన జీవనోపాధి నుండి ఇతరులకు కూడా ఇవ్వండి' అన్నారు. అబూజర్ అడిగారు : 'ఓ ప్రవక్తా! అతడే స్వయంగా బీదవాడైతే.'

ప్రవక్త ఇలా జవాబిచ్చారు : 'అయితే అతడు నోటి మాటతో సత్కార్యము చేయాలి.'

అబూజర్ (రజి) అన్నారు – ఒకవేళ ఆయన నోటితో ఏమీ చెప్పలేని స్థితిలో ఉంటే?

దానికి ఇలా సమాధానం ఇచ్చారు : 'బలహీనునికి సహాయం చేయాలి?'

అబూజర్ (రజి) 'అతడు ముసలివాడై, సహాయం చేయలేని స్థితిలో ఉంటే?' అన్నారు.

'అప్పుడు ఏ పని చేయలేని వారి పని చేసిపెట్టాలి?' అని సమాధాన మివ్వబడింది.

'ఒకవేళ అతడు ఆ పనిని కూడా చేయలేనివాడైతే?'

దానికి సమాధానంగా ప్రవక్త ఇలా అన్నారు, 'ఇతరులకు తన వల్ల హాని కలుగకుండా జాగ్రత్తపడాలి.' (సీరతున్నబీ).

ఇంకో హదీసులో ఇలా చెప్పబడింది : "ఎవరయినా నా ఉమ్మత్‌లోని ఒకరి ధార్మిక లేక ప్రాపంచిక అవసరాన్ని తీర్చి సంతోషపెట్టినట్లయితే అతడు నన్ను (ప్రవక్తను) సంతోష పెట్టినట్లు - నన్ను సంతోష పెట్టడం అల్లాహ్‌ను సంతోష పెట్టడంతో సమానం - అల్లాహ్‌ను సంతోషపెట్టిన వానికి అల్లాహ్ స్వర్గంలో ప్రవేశం కల్పిస్తాడు."

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఇలా ఉల్లేఖించారు : ప్రవక్త (సఅసం) వద్దకు ఒక వ్యక్తి వచ్చి ఇలా అడిగాడు : 'అల్లాహ్‌కు అత్యంత ప్రియమైన దాసుడు ఎవరు? ప్రవక్త (సఅసం) ఇలా సమాధానం ఇచ్చారు -

సాటి ప్రజలకు ఎక్కువ ప్రయోజనం చేకూర్చేవాడే అల్లాహ్ దృష్టిలో జనులలోకెల్లా ప్రియతముడు. ఇక కర్మల దృష్ట్యా అల్లాహ్‌కు ఎక్కువ ప్రియమైన వాడెవడంటావా! నువ్వు తోటి ముస్లిం ఆపదను తొలగించి అతన్ని సంతోషపెట్టాలి లేదా అతని ఆకలి బాధను తొలగించాలి. ఇంకా ఏమిటో చెప్పమంటావా? నేను ఈ మస్జిద్‌లో (మస్జిదె నబవీలో) ఒక నెల రోజుల పాటు ఏతెకాఫ్ వ్రతం పాటించటం కన్నా తోటి సోదరుని వెంట అతని అవసరం తీర్చటం కొరకు వెళ్ళడం నాకు ఎక్కువ ప్రీతికరం. తాను కోరితే ఆగ్రహం వెళ్ళగ్రక్కే అవకాశం ఉన్నప్పటికీ కోపాన్ని దిగమ్రింగిన వాని హృదయాన్ని అల్లాహ్ ప్రళయదినాన తన ప్రసన్నతతో నింపేస్తాడు. మరెవరయితే తన సోదరుని వెంట అతని అవసరం తీర్చటానికి వెళ్ళి, అవసరం తీరుస్తాడో, అల్లాహ్ - అడుగులు తడబడే దినాన - అతని పాదాలకు స్థిరత్వాన్ని ప్రసాదిస్తాడు.

## సుఖదుఃఖాలలో పాలు పంచుకోవడం

ఒక ముస్లిం అవసరాన్ని తీర్చడం, సహాయం చేయడం ఒండొరుల పట్ల మంచి ప్రవర్తన కలిగి ఉండడం అనేది ఒకరి దుఃఖాన్ని తన దుఃఖంగా భావించడంలో ఉంది. తోటివాని కష్టాన్ని మనిషి తన కష్టంగా భావించాలి. ఎలాగైతే శరీరంలోని ఒక భాగం కష్టానికి లోనైతే మిగతా శరీరం కూడా బాధకు లోనవుతుందో అదేవిధంగా ఒక ముస్లిం బాధల్లో ఇంకొక ముస్లిం పాలు పంచుకోవాలి.

ప్రియ ప్రవక్త ఈ విషయాన్ని ఎన్నో ఉదాహరణలతో వివరించారు. ఒకసారి ఇలా అన్నారు : "పరస్పరం కరుణతో, పరస్పరం ప్రేమ వాత్సల్యాలతో దుఃఖాల్లో పాలుపంచుకుంటూ ఒకే శరీరంగా విశ్వాసులు ఉండాలి. శరీరంలో ఒక భాగం అనారోగ్యం పాలైతే మొత్తం శరీరం జ్వరంతో రాత్రుల్లో నిద్ర లేకుండా బాధలో పాలు పంచుకుంటుంది." (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

ఇంకా ఇలా వివరించబడింది. "ముస్లింలు పరస్పరం ఒక కట్టడంలా ఉండాలి. కట్టడంలోని ఒక ఇటుక ఇంకొక ఇటుకకు ఆధారాన్ని బలాన్ని ఇచ్చినట్లే ఒకరికొకరు బలంగా, దృఢంగా ఉండాలి." ఇలా అని ప్రవక్త తమ రెండు చేతివ్రేళ్ళను ఒకదానిలో ఇంకొకటిని చేర్చిపట్టుకొని చూపించారు. (బుఖారీ, ముస్లిం - అబూ మూసా (రజి) కథనం).

## తప్పు తెలుపడం : హితబోధ చేయడం

ఒక ముస్లిం తన సోదరుని కర్మలు ఆచరణలపై దృష్టి ఉంచాలి. ఎక్కడైతే అతడు సన్మార్గాన్ని విడిచిపెడతాడో అక్కడ హితబోధ ద్వారా అతనిలో మంచి నడవడికను పెంపొందింపజేయాలి. ఇది ఒక బాధ్యతగా భావించాలి. కాని ఈ బాధ్యతను నెరవేర్చడంలో నిష్ఠూరానికి గురయ్యే అవకాశం ఉంది. కాని ఒక వ్యక్తి నిజమైన సాఫల్యం పరలోక సాఫల్యమే అని భావించినట్లయితే "హితబోధ" అన్నది ఇద్దరినీ పరలోక సాఫల్యం కొరకు సమాయత్తం చేస్తుంది. ఎందుకంటే ప్రపంచంలోని లెక్కలు పరలోక లెక్కల కంటే తేలికైనవి. ఈ భావన ఉన్నప్పుడు ఒక ముస్లిం తన తోటి వాని పట్ల కృతజ్ఞతా భావం కలిగి ఉంటాడు. ఎందుకంటే అతడు తనకు ప్రపంచంలోని నష్టాన్నుండి రక్షించడానికి తగిన సమయంలో హితబోధ ద్వారా సహాయపడ్డాడని భావిస్తాడు. విమర్శ యొక్క అన్ని షరతులను దృష్టిలో ఉంచుకుంటే అంటే – హితబోధ అనేది హృదయపూర్వకంగా, ప్రేమ, వాత్సల్యాలతో చేస్తే తోటివానిలో ప్రేమాభిమానాలు అధికం అవుతాయి. ఎందుకంటే హితబోధ చేసేవాడు గొప్ప మహోపకారిగా కనబడుతాడు. విమర్శించడంలో గల షరతులను మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా బోధించారు : "మీలో ప్రతి ఒక్కరూ తమ సోదరుని పాలిట అద్దం లాంటివారు

- కావున మీ సోదరునిలో తప్పు కనబడితే - దానిని దూరం చేయండి." (తిర్మిజి - అబూహురైరా కథనం)

అబూదావూద్ ఉల్లేఖనంలో ఇలా ఉంది : "ఒక ముస్లిం ఇంకొక ముస్లింకు అద్దం లాంటివాడు. ఒక విశ్వాసి మరో విశ్వాసికి సోదరుడు. అతడు లేనప్పుడు అతని హక్కులను పరిరక్షిస్తాడు." (అబూదావూద్ - మిష్కాత్)

ఈ ఉదాహరణల ద్వారా క్రింది సూత్రాలను రూపొందించవచ్చు.

(1) తప్పుల కొరకు అతిగా అనుమానించరాదు. ఎందుకంటే అద్దం అనుమానించదు. అది వ్యక్తి తన ముందుకు వచ్చినప్పుడు మాత్రమే అతని తప్పును లోపాన్ని చూపిస్తుంది.

(2) వ్యక్తి లేనప్పుడు పరోక్షంగా విమర్శ చేయకూడదు. ఎందుకంటే అద్దం వ్యక్తి తన ముందు ఉన్నంత వరకే లోపం, తప్పు చూపిస్తుంది.

(3) అద్దం ఎంత లోపం ఉంటుందో అంతే చూపిస్తుంది. వ్యక్తిలో ఎంత లోపం ఉంటుందో అంతే చూపెట్టాలి.

(4) విమర్శ పక్షపాతంతో ఉండకూడదు. దుస్సంకల్పంతో అకారణంగా ఉండకూడదు. అద్దానికి ఈర్ష్యాసూయలు ఉండవు.

(5) విషయాన్ని చేరవేసిన తర్వాత మళ్ళీ దానిపై చర్చలు సాగించరాదు. ఎందుకంటే అద్దం ముందు నుండి వ్యక్తి జరిగినప్పుడు అతని ప్రతిబింబం కూడా మాయమవుతుంది.

(6) విమర్శలో ఆవేదన, సత్సంకల్పం, దైవభీతి, ప్రేమ, వాత్సల్యాలు తప్పకుండా ఉండాలి. వీటి ద్వారానే విమర్శ పొందేవాడు తాను విమర్శించబడే 'పరిస్థితి'ని సునాయాసంగా దాటగలడు. అందుకొరకే "ముస్లిం ఒక అద్దం". "ముస్లింలు పరస్పరం సోదరులు" అని అనడం జరిగింది. 'మనస్ఫూర్తి' అనేది ఎప్పుడు వస్తుందంటే, విమర్శకుడు తాను విమర్శించే వ్యక్తిలో ఉన్న లోపం అతన్ని నష్టంలో పడదోస్తుంది అని భావించినప్పుడు మాత్రమే. విమర్శకుడు తాను ఎదుటివాని కంటే గొప్పవాణ్ణి అనుకోరాదు. తనను అతనికంటే ఎక్కువ బలహీనుడిగా, తప్పు చేసేవానిగా భావించాలి.

# కలుసుకోవడం

ప్రేమకు సంబంధించిన ప్రాథమిక విషయమేమిటంటే మనిషి ఎవరినైతే ప్రేమిస్తున్నాడో - అతన్ని ఎక్కువసార్లు కల్సుకోవాలనుకుంటాడు. అతనితో స్నేహం, సంభాషణలు ఎక్కువగా చేయాలనుకుంటాడు. అతని వద్ద ఎక్కువ కాలం గడపాలనుకుంటాడు. మానసికంగా ఇది ఎంతో ముఖ్యమైనది. ఎందుకంటే ప్రేమ పెంచి పరస్పరం దగ్గరయ్యేలా చేయడానికి కల్సుకోవడం సంభాషించడం ఎంతో అవసరం. ఈ వాస్తవం ఒక విద్యార్థికి కూడా తెలుసు. ఏ కొద్ది సమయం దొరికినా తన తోటివానిని కల్సుకోవడానికి ప్రయత్నించాలి. మాట్లాడిన ప్రతిసారి ప్రేమ పెంపొందాలి. ఈ విధంగా సంబంధాలు దృఢతరం అవుతూ ఉండాలి. పైన చెప్పబడిన షరీఅత్ పరిధులను దృష్టిలో ఉంచుకోవాలి. కష్టపెట్టడం, నొప్పించడం అనే వాటికి చోటుండరాదు. ముందు పేర్కొనబోయే విషయాలను కూడా మనం దృష్టిలో ఉంచుకుంటే ప్రేమ వాత్సల్యాలతో కూడుకున్న సత్సంబంధాలు ఏర్పరచుకోవచ్చు. ఈ విషయాలకు ప్రియప్రవక్త (సఅసం) ఎంతో అధిక ప్రాధాన్యతను ఇచ్చారు. ఈ విషయమై ఆదేశాలు ఇచ్చారు. వీటి ప్రాముఖ్యతను తెలిపారు. ఒక హదీసులో 'మంచి వారి స్నేహం ఒంటరిగా ఉండటం కంటే ఉత్తమమైనది' అన్నారు. ఒకసారి ప్రవక్త (సఅసం) అబూజర్ (రజి)ను ఉద్దేశించి ఇలా అన్నారు : 'నీకు తెలుసా! ఒక ముస్లిం తన తోటివానిని కల్సుకోవడము కొరకు, అతన్ని చూడ్డానికి ఇంటి నుండి బయలుదేరితే అతనిపై డెబ్బయి వేల దైవదూతలు నియమించబడతారు. ఆ దైవదూతలు అతని కోసం ఇలా ప్రార్థిస్తారు : "ఓ మా ప్రభూ! ఇతడు కేవలం నీ కోసం కలువడానికి వెళ్తుంటే అతన్ని కలుపు." (బైహఖీ, అబూజర్ కథనం, మిష్కాత్)

ఒక హదీసులో ప్రవక్త (స) ఇలా ప్రవచించారు : 'ఒక వ్యక్తి తన సోదరుని కలవడానికి ఇంకో గ్రామానికి బయలుదేరాడు. అల్లాహ్ అతని మార్గంలో ఒక 'దూత'ను నియమించాడు. ఆ దూత ఆ బాటసారిని ఎక్కడికి వెళ్లుతున్నావు? అని అడిగాడు. 'ఆ గ్రామంలో ఉన్న నా సోదరున్ని కలవటానికి వెళుతున్నాను' అని సమాధానమిచ్చాడా బాటసారి. సోదరుని దగ్గర ఏమన్నా నీకు రావలసింది ఉందా, దాన్ని పొందటానికి నీవు వెళుతున్నావా?' అని అడిగాడు దైవదూత. సమాధానంగా

'లేదు, నేను కేవలం అల్లాహ్ కొరకు అతన్ని ప్రేమిస్తున్నాను' అన్నాడతను. దూత ఇలా అన్నాడు : 'నన్ను అల్లాహ్ నీ వద్దకు పంపాడు. ఇలా శుభవార్త తెలిపాడు : నీవు నీ సోదరుని ఎలా ప్రేమిస్తున్నావో అలానే అల్లాహ్ కూడా నిన్ను ప్రేమిస్తున్నాడు.' (ముస్లిం, అబూ హురైరా కథనం).

ప్రవక్త (సఅసం) సహచరులు ఒకరు ముఆజ్ బిన్ జబల్ (రజి)పై తన అభిమానాన్ని వ్యక్తపరిచారు. కేవలం అల్లాహ్ కొరకే తాను ప్రేమిస్తున్నానని వివరించారు. దానికి సమాధానంగా ముఆజ్ (రజి)కు ఆ సహచరునికి ప్రవక్త (సఅసం) వారి శుభవార్తను వినిపించారు. అందులో అల్లాహ్ ఇలా అంటాడు : "నా కొరకు పరస్పరం కలుసుకునేవారు, నా కొరకు ధనాన్ని వ్యయపరిచేవారిపై నా ప్రేమ వాజిబ్ (తప్పనిసరి) అవుతుంది." అల్లాహ్ కొరకు ప్రేమించేవారికి శుభవార్త ఇలా తెలియజేయబడింది :

"స్వర్గంలో యాఖూత్ అనబడే స్తంభాలున్నాయి. వాటిపై బజర్‌జద్ అనబడే ప్రత్యేక గదులున్నాయి. వాటి ద్వారాలు నక్షత్రాల్లా మెరుస్తుంటాయి. సహచరులు (రజి) అడిగారు : 'ఓ ప్రవక్తా! ఇవి ఎవరి కోసం చేయబడినవి - ఇందులో ఎవరు నివసిస్తారు?' ప్రవక్త మహనీయులు (సఅసం) జవాబిస్తూ, "కేవలం అల్లాహ్ కొరకే కలిసి కూర్చునేవారు, పరస్పరం కలుసుకునేవారు అల్లాహ్ కొరకే ప్రేమించుకునేవారు ఇందులో నివసిస్తారు." (బైహఖీ)

పరస్పరం కలుసుకోవటాన్ని ప్రేమ వాత్సల్యాలు కలిగి ఉండటాన్ని ఇంత గట్టిగా ఆదేశించడం జరిగింది. దీనికి ఇంత పెద్ద ప్రతిఫలం లభిస్తుందన్న శుభవార్త ఇవ్వబడింది. ప్రేమానురాగాలు మరింత పెంపొందింపజేయడానికే ఈ శుభవార్త. ఒక మనిషి మరొక మనిషికి తోడుగా ఆసరాగా ఉన్నాడన్న నమ్మకం, విశ్వాసం అనేవి సంభాషణల ద్వారానే సాధ్యపడుతాయి. మనిషి తన తోటివానిని కలిసినప్పుడు అల్లాహ్‌ను స్మరణలో ఉంచుకుంటే - పుణ్యభావంతో కలిస్తే ఇది అతని వ్యక్తిత్వ నిర్మాణంలో ఎంతయినా సహాయపడుతుంది.

ఈ విషయాలను మనం దృష్టిలో ఉంచుకుంటే మనకు ఓ వాస్తవం అర్థమవుతుంది. అదేమిటంటే ఒక విశ్వాసి ఇంకొక విశ్వాసిని ఎక్కువసార్లు కలవడానికి

ప్రయత్నించాలి. దీనితో సంబంధాలు పటిష్టమవడమే కాక డెబ్బయి వేల దూతల ప్రార్థన (దుఆ), అల్లాహ్ ప్రేమ లభిస్తాయి. అల్లాహ్ కొరకు - పరస్పరం కలుసుకున్నప్పుడు ఈ హదీసులను దృష్టిలో పెట్టుకోవాలి.

## పరామర్శ

వ్యాధిగ్రస్తుడైన తోటి సోదరుణ్ణి పరామర్శించడం ఒక ముస్లిం బాధ్యత. ఈ విధంగా తోటివానిని కలుసుకోవడం చాలా ముఖ్యమైన పని. వ్యాధిగ్రస్తుడైన వ్యక్తి శారీరకంగా, మానసికంగా ఇతరుల సానుభూతి సేవలు పొందటానికి అర్హుడు. ఈ సమయంలో మనిషి తన తోటివానికి సానుభూతి సేవలను అందిస్తే అది అతని హృదయంపై చెరగని ముద్ర వేస్తుంది. సంబంధాలను పటిష్టపరుస్తుంది. పరామర్శ అన్నది కేవలం వ్యాధిగ్రస్తుని సందర్శించడమే అనుకుంటాం. ఇది కేవలం కనిష్ట పరామర్శ మాత్రమే. సందర్శించడం, ఆరోగ్య పరిస్థితి తెలుసుకోవడం సేవ చేయడం కూడా 'పరామర్శ'లో భాగాలే. వ్యాధిగ్రస్తుని సందర్శించడానికే గట్టిగా ఆదేశించినపుడు ఇక పరామర్శించడం, సేవ చేయడం ఇంకెంత ముఖ్యమైనవో ఆలోచిస్తే తెలుస్తుంది.

ముస్లింల హక్కుల గురించి తెలిపే హదీసులలో 'పరామర్శించడం బాధ్యతగా, పరామర్శ పొందడం వ్యాధిగ్రస్తుని హక్కుగా తెలిపారు.

ఎవరైనా అనారోగ్యం పాలైతే, అతన్ని పరామర్శించాలి. దైవప్రవక్త (సఅసం) ఈ విషయాన్ని తెలుపుతూ అల్లాహ్‌చే హక్కులు ప్రసాదించబడ్డాయి. ప్రళయదినాన హక్కులు నిరాకరించబడిన వ్యక్తి తరఫున అల్లాహ్ వాదిస్తాడు. అదేవిధంగా పరామర్శ గురించి తెలుపుతూ 'ఓ ఆదం కుమారా! నేను అనారోగ్యం పాలయితే నన్ను నీవు పరామర్శించటానికి ఎందుకు రాలేదు?" అని అడుగుతాడు - ఆ దాసుడు ఇలా అంటాడు : 'ఓ ప్రభువా! నీవు నిఖిల జగత్తుకు స్వామివి, నిన్ను నేను ఏ విధంగా పరామర్శించాలి?' దీనికి సమాధానంగా అల్లాహ్ అంటాడు : 'నా ఫలానా దాసుడు అనారోగ్యంతో బాధ పడుతున్నప్పుడు నీవు ఒకవేళ అతన్ని సందర్శించి పరామర్శించి ఉంటే నీవు అక్కడ నన్ను పొంది ఉండేవాడివి." ఒక వ్యక్తి పరామర్శ ద్వారా తన స్వామిని కలుసుకోగలిగితే దానికంటే సౌభాగ్యం ఇంకేముంటుంది?

పరామర్శ వల్ల లభించే పుణ్యఫలం ఈ విధంగా తెలుపబడింది. ప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు : "ఒక వ్యక్తి పరామర్శకు వెళ్లి అతను తిరిగి వచ్చే వరకు స్వర్గంలోని ఫలాలను పొందుతూ ఉంటాడు." (అహ్మద్, తిర్మిజి) ఇంకా ఒక ముస్లిం ఇంకొక ముస్లింను పరామర్శించటానికి ఉదయం వెళ్తే అతని కోసం డెబ్బయి వేల దూతలు సాయంత్రం వరకు ప్రార్థిస్తూ ఉంటారు. సాయంత్రం పరామర్శకెళ్తే ఉదయం వరకు డెబ్బయివేల మంది దూతలు అతని కోసం ప్రార్థిస్తూ ఉంటారు. దీనికి ప్రతిఫలంగా అతనికి స్వర్గంలోని పండ్లు ఫలాల తోటలు లభిస్తాయి. (తిర్మిజి, అబూదావూద్).

ఇంకా ఎవరైతే వ్యాధిగ్రస్తుని పరామర్శించటానికి వెళ్తాడో, అతను కారుణ్య (రహ్మత్) సాగరంలో ప్రవేశిస్తాడు. రోగి దగ్గర కూర్చున్నప్పుడు కారుణ్యం (రహ్మత్)లో మునిగి ఉంటాడు. (మాలిక్, అహ్మద్)

దైవప్రవక్త (సఅసం) ఇంకా ఇలా సెలవిచ్చారు – పరామర్శలో పరిపూర్ణత ఏమిటంటే పరామర్శకుడు తన చేతులను రోగి చేతిపై లేదా నుదుటిపై ఉంచి, 'ఎలా ఉన్నావు?' అని అడగాలి. పరామర్శలో అతి ముఖ్యమైన విషయం రోగికి సాంత్వన వచనాలు పలకడం, అతన్ని సానుభూతితో పలకరించడం. దైవప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు : 'రోగి వద్దకు వెళ్ళి సాంత్వన వచనాలు పలకాలి. ఇది దైవాదేశాన్ని మార్చదు, కాని రోగి మనస్సుకు నెమ్మదినిస్తుంది.' (తిర్మిజి, ఇబ్నెమాజ)

దైవప్రవక్త (సఅసం) పరామర్శకు వెళితే రోగి నుదుటిపై తన చేతిని ఉంచి ఓదార్పు మాటలు పలికేవారు. ఇంకా నీకేం కావాలి అని అడిగేవారు. ఇదే విషయాన్ని సహచరులు (రజి) అనుసరించాలని ఆదేశించారు. (అబూదావూద్ – సీరతున్నబీ)

రోగి వద్ద ఎక్కువ సేపు కూర్చుండకూడదు. గొడవ చేయరాదు.

## భావాల వ్యక్తీకరణ

వ్యక్తి తన మనస్సులో సంతోషం కలిగితే దానిని వ్యక్తపరచాలి. దీనివల్ల రెండు లాభాలు కలుగుతాయి. ఉత్సాహాన్ని వ్యక్తపరచడం వలన ఉల్లాసము

ఏర్పడుతుంది. ఆనందం వెల్లివిరుస్తుంది. అందులో అభివృద్ధి కలుగుతుంది. హృదయంలో దాచుకుంటే హృదయం అచేతనంగా మారుతుంది. అభివృద్ధి ఆగిపోతుంది. క్రొత్తదనము, తాజాదనము లోపిస్తాయి. ఈ విధంగా క్రమముగా అతడు తిరోగమనం దారి పడతాడు. రెండో లాభం ఏమిటంటే ఆనందోత్సాహాలు వ్యక్తీకరించడం వలన సంబంధాలు ఇంకా పటిష్టంగా మారడానికి ఆస్కారముంది. తన తోటివాడు తన గురించి మనస్సులో ఉంచుకున్న ప్రేమానురాగాలు వ్యక్తపరిచితే తోటివాని ఆ ప్రేమ మనిషిపై ఎంతో ప్రభావం చూపిస్తుంది. అభివ్యక్తి జరగకుంటే ఇద్దరి మనస్సులలో ప్రేమానురాగాలు ఉన్ననూ ఈ విషయం బయటికి రాదు. సంబంధాలు పటిష్టంగా మారవు. అందువల్ల మనిషి తన ప్రేమను తన తోటివాని ముందు వ్యక్తపరచగలగాలి. ఆ విధంగా ప్రేమానురాగాలు పెంపొందే అవకాశం ఉంది. కాని ఈ విషయం తోటివానికి తెలియకుంటే వారిరువురూ ఒండొకరిపట్ల సదభిప్రాయం కలిగి ఉన్నప్పటికీ వారి ప్రేమానురాగాల బంధం బలోపేతం కాకపోవచ్చు!

ఇద్దరు మనుష్యులలో ప్రేమను పెంచటానికి, ఇంకా ఇద్దరి మధ్య కలతలను చెరిపివేయడానికి ప్రేమను వ్యక్తపరచడం అవసరం. ఒక వ్యక్తి తన మనస్సులో ప్రేమను ఉంచుకుని మాటల్లో వ్యక్తపరచనట్టైతే, దానిని ఆచరణా రూపంలో వ్యక్తీకరించి నప్పటికీ తోటివాని మనస్సులో అనుమానం, దూరం పెరగడానికి అవకాశం ఉంది. హృదయంలో రూపుదాల్చుకున్న ప్రేమ వాత్సల్యాలు వ్యక్తపరచినట్లయితే దానితో ఎన్నో మార్గాలు సుగమమవుతాయి. అప్పుడు మనిషి చేసే ఒక్కొక్క పని తోటివాని పట్ల ప్రేమను వ్యక్తీకరిస్తుంది. మంచి నడవడిక, అవసరాలను తీర్చడం, మనస్ఫూర్తిగా సంస్కరించటానికి ప్రయత్నించడం, భోజనాలకు పిలువడం నిస్సంకోచంగా భావ ప్రకటన, చిరునవ్వు, సుఖ దుఃఖాలలో పాలుపంచుకోవడం, వ్యక్తిగత విషయాలలో పూర్తి నమ్మకం తదితర విషయాల ద్వారా ప్రేమను వ్యక్తీకరించవచ్చు. ఈ విషయాలలో కొన్నిటిపై ఇంతవరకు చర్చ జరిగింది. ఇంకా కొన్ని విషయాలు ముమ్ముందు చర్చకు వస్తాయి. చేతల ద్వారా ప్రేమను వ్యక్తీకరించడం తర్వాత ముఖ్యమైనది నోరు. నోటి ద్వారా పలికిన ఒక చెడు వాక్యం వ్యక్తి హృదయాన్ని గాయపరుస్తుంది. ఆ గాయాన్ని మాన్పడం చాలా కష్టం. అలాగే ఒక మంచిమాట నోటి ద్వారా వెలువడటం కూడ

వ్యక్తిని చాలా ప్రభావితం చేస్తుంది. ఈ విషయం అంచనా వేయడం చాలా కష్టం. అందుకొరకే దైవప్రవక్త 'నాలుక' విషయంలో చాలా జాగ్రత్తగా ఉండమని సూచించారు. ఎందుకంటే ఈ నాలుకయే సంబంధాలలో ఉపద్రవం లేపి వాటిని త్రుంచగలదు. ఒక వ్యక్తి తన నోటిని మంచిగా ఉపయోగిస్తే సంబంధాలలో ప్రేమాభిమానాలు పెంపొందుతాయి. చాలా తక్కువమంది ఈ విషయాన్ని అర్థం చేసుకుంటారు. నోటితో వెలువడే చిన్న చిన్న వాక్యాలు ఇతరుల హృదయాలను ఎంత రంజింపజేస్తాయో మనకు తెలుసు. ఒక్కొక్కసారి పెద్ద పెద్ద త్యాగం కూడా పనికి రాదు. మంచివాక్కు, ధైర్యం చెప్పడం, హృదయాన్ని రంజింపజేసే మాటలు పలకడంలో పిసినారితనం ప్రదర్శించి ఎంతో మంది ఇతరుల హృదయాలను సంతోష పెట్టడంలో విఫలం అవుతారు. హదీసులో అయితే ఇలా చెప్పబడినది : ఎవరైతే ఒక ముస్లింను సంతోషపెడ్తాడో అతడు దైవప్రవక్తను సంతోషపరిచాడు. దైవప్రవక్తను సంతోషపరచినవాడు అల్లాహ్‌ను సంతోషపరిచాడు. అల్లాహ్ సంతోషపడితే ఆ వ్యక్తికి స్వర్గంలో ప్రవేశం కల్పిస్తాడు. అసలు కొందరైతే మంచి మాటలు పలుకరు. వారు హృదయాన్ని గాయపరచిన వారవుతారు. కొన్నిసార్లు అశ్రద్ధతో అలక్ష్యంగా మాట్లాడతారు. దీని గురించి హదీసులో ఇలా తెలుపబడింది : 'ఎవరైతే ముస్లింను కష్టపెడతాడో, బాధ కలిగిస్తాడో అతడు అల్లాహ్‌కు బాధ కలిగించినట్లే. నోటితో ప్రేమను వ్యక్తీకరించడం, సలాం చేయడం, మంచి కొరకు ప్రార్థన, మృదువైన ప్రేమైక వాక్యాలు, సానుభూతి తెలుపడం మొదలగునవి చాలా ముఖ్యమైనవి.

నోటి ప్రాముఖ్యతను గురించి దైవప్రవక్త (సఅసం) ఇలా వివరించారు : "మనిషి చుట్టు (ప్రళయదినాన) అగ్ని పరచబడి ఉంటుంది. లేదా అతని కర్మలు ఉంటాయి. ఆ సమయంలో అల్లాహ్ ప్రత్యక్షంగా అందరి లెక్కలు తీసుకుంటాడు. ఈ అగ్ని నుండి రక్షణ పొందటానికి ఖర్జూరపు పండునైనా (కనీసం) దానం చేయండి. లేదా కనీసం ఒక మంచి మాట ద్వారానైనా రక్షణ పొందండి."

అన్ని రకాల నిదర్శనాలను, వివిధ కోణాలను పరిశీలిస్తే అల్లాహ్, ఆయన ప్రవక్త ఈ విధమైన ఆదేశాలు ఇలా ఎందుకు ఇచ్చారో అర్థమవుతుంది. ప్రేమను ప్రకటించడంపై ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : 'ఒక వ్యక్తి తన తోటివానిని

ప్రేమిస్తే దాన్ని అతని వద్ద ప్రకటించాలి.' (అబూదావూద్, తిర్మిజి). ఒకసారి ప్రవక్త (సఅసం) దగ్గరి నుండి ఒక వ్యక్తి పోతుండగా, ప్రవక్త (సఅసం) వద్ద కూర్చొని ఉన్న అనుచరులలో ఒక వ్యక్తి పోతున్న వ్యక్తి గురించి తన ప్రేమను వ్యక్తపర్చాడు. అందుకు దైవప్రవక్త (సఅసం) 'ఈ విషయం ఆయనకు తెలిపినావా' అని అడిగారు. దానికతను 'లేదు' అన్నాడు.

ప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు : "వెళ్ళు, వెళ్ళి ఈ విషయం అతనికి తెల్పు. అల్లాహ్ కొరకు నేను ప్రేమిస్తున్నానని వివరించు." అప్పుడు ఆ వ్యక్తి వెళ్ళి ఆ విషయాన్ని తెల్పాడు. ఆ వ్యక్తి దానికి సమాధానంగా 'ఎవరి కోసమైతే నీవు నన్ను ప్రేమిస్తున్నావో అతను కూడా నిన్ను ప్రేమించుగాక!' అని పలికాడు. (బైహఖీ, తిర్మిజి)

హజ్రత్ అబూ హురైరా (రజి) ఒకసారి ఒక సంఘటన గురించి వివరించారు. దైవప్రవక్త (సఅసం) అలి (రజి) కుమారుడైన హసన్ (రజి)ను ముద్దాడారు. ఆ సమయంలో ఇఖర్ బిన్ హాబిస్ అక్కడే ఉన్నారు. ఆయన అన్నారు – "నాకు పదిమంది కుమారులున్నారు. ఎప్పుడు కూడా నేను వారిని ముద్దాడలేదు." అది విని దైవప్రవక్త (సఅసం) – 'ఎవరైతే దయాగుణం కలిగి ఉండరో వారిపై దయ చూపబడదు' అని అన్నారు. (బుఖారీ, ముస్లిం)

వేరొక హదీసులోని వాక్యం ఇలా ఉంది : "అల్లాహ్ నీ హృదయంలో దయార్ద్రతే లేకుండా చేస్తే దానికి నేనేం చేయను?"

మన ఆనందాన్ని ప్రకటించడానికి మంచి సమయం పరస్పరం కలుసుకున్నప్పుడు లభిస్తుంది. పరస్పరం కల్సుకోవడం ఎంత ముఖ్యమో తెలియంది కాదు. పరస్పరం కలవడం అన్నది ఎలా ఉంటే బాగుంటుందో చూద్దాం.

## ప్రేమతో ఆప్యాయంగా ...

సంబంధాలను పటిష్ట పరచడంలో 'సద్వ్యవహారం' తరువాత అతి ముఖ్యమైనది పరస్పరం కల్సుకోవడం. ఇందులో దుర్భాషణం, వ్యంగ్యం, హేళన, ఎగతాళి మొదలైన అవలక్షణాలకు దూరంగా ఉండాలి. ఇంకా కల్సుకోవడం ప్రేమ వాత్సల్యాలు

పెంపొందేలా ఉండాలి. దీని గురించి ఎన్నో హదీసులు మనకు లభిస్తాయి. ఎడాపెడా మాట్లాడటం, కఠినంగా మాట్లాడటం, నిర్లక్ష్యంగా మాట్లాడటం, అవసరం లేనట్లుగా మాట్లాడటం వలన మనస్సు విరిగిపోతుంది. ఇలా కాకుండా హృదయాలను నొప్పించకుండా మెత్తగా సున్నితంగా మాట్లాడాలి. దైవప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు. 'నేను ఒక వ్యక్తి యొక్క చిరునామా మీకిస్తున్నాను. అతనిపై నరకాగ్ని హరామ్ (నిషేధం) చేయబడింది. నరకాగ్నికి అతడు హరామ్ (నిషేధం) చేయబడినాడు. అతడు ఎవరంటే; మృదువుగా మాట్లాడేవాడు. మృదుస్వభావం గలవాడు. (అహ్మద్, తిర్మిజి, ఇబ్నె మసూద్, మిష్కాత్) కలుసుకున్నప్పుడు చిరునవ్వుతో కలుసుకోవాలి. నిర్మలంగా మాట్లాడాలి.

ఒకసారి ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు – "పుణ్యకార్యాలలో దేనినీ చిన్నదిగా భావించరాదు. అది చిరునవ్వుతో కలవడం కూడా కావచ్చు." ఇంకా ఇలా చెప్పబడింది – "తన తోటివానిని చూసి చిరునవ్వు చిందించడం కూడా పుణ్యకార్యమే."

అశ్రద్ధ ప్రదర్శించకుండా కలవాలి. కలుసుకోవడం ఎంతో ఆనందాన్ని ఇస్తున్నదని తెలపాలి. ప్రియప్రవక్త (సఅసం) గురించి సహచరులు (రజి) ఇలా అనేవారు – ప్రవక్త ఎవరిని కలిసినా మనస్ఫూర్తిగా కలిపేవారు. బైహఖీలో ఒక సంఘటన ఇలా వివరించబడింది – ప్రియప్రవక్త (సఅసం) ఒకసారి మస్జిద్‌లో ఆసీనులయి ఉన్నారు. ఒక వ్యక్తి రాగానే ప్రవక్త (సఅసం) కొద్దిగా ప్రక్కకు కదిలారు. ఆయన అన్నారు, "ఓ ప్రవక్తా! స్థలం సరిపోయినంత ఉంది కదా!" దానికి ప్రవక్త (సఅసం) 'ముస్లిం విధి ఏమిటంటే అతని సోదరుడు అతన్ని కలవడానికి వస్తే అతనిలో కదలిక కానరావాలి." (తర్జుమానుల్ సున్నహ్). హజ్రత్ ఆయిషా (రజి) ఇలా అన్నారు : "జైద్ బిన్ హారిస్ (రజి) మదీనా వచ్చినపుడు ప్రియప్రవక్త (సఅసం) ను కలవడానికి వచ్చారు. వచ్చి తలుపు తట్టారు. ప్రియ ప్రవక్త భుజాలపై ఆచ్ఛాదన లేకుండా కేవలం భుజాలపై ఒక దుప్పటి కప్పుకుంటూ ఇవతలికి వచ్చారు. ఆ స్థితిలో ప్రియ ప్రవక్తను నేను ఎప్పుడూ చూడలేదు. ఇంకా ప్రవక్త ఎంతో ప్రేమగా ఉత్సాహంగా జైద్‌ను ఆలింగనం చేసుకున్నారు. ముద్దాడారు. ఇదేవిధంగా హజ్రత్ జాఫర్ తయ్యార్ (రజి) అబీసీనియా నుండి తిరిగి వచ్చినప్పుడు ప్రియప్రవక్త (సఅసం)

అతన్ని ఆలింగనం చేసుకుని ముద్దాడారు. హజ్రత్ ఇక్రిమ ప్రవక్త దగ్గరకొస్తే '(నిజ ధర్మం వైపు) హిజ్రత్ చేసిన నీకు శుభాకాంక్షలు' అని అన్నారు.

# సలాం చేయడం

ఆనందోత్సాహాలకు సలాం ద్వారా ఒక రూపం కల్పించి దానిని కూడా ముస్లింల విధులలో చేర్చడం జరిగింది. ఆనందాన్ని తెల్పడమే కాక సలాం ద్వారా వ్యక్తి తన తోటివాని మంచిని కాంక్షిస్తాడు. తోటివాని కొరకు ప్రార్థిస్తాడు. ప్రియప్రవక్త (సఅసం) మదీనా వలస వచ్చినపుడు చేసిన తొలి ప్రసంగంలో నాలుగు విషయాలను ఆదేశించారు. అందులో ఒకటి 'సలాంను (పరస్పరం) వ్యాపింపజేయండి' అన్నది. ఇంకో హదీసులో ఇలా తెల్పబడింది : 'మీరు విశ్వాసులు కానంత వరకు స్వర్గంలో ప్రవేశించలేరు. పరస్పరం ప్రేమతో మెలగనంత వరకు విశ్వాసులు కాలేరు. ప్రేమను పెంపొందించే విషయం మీకు తెల్పనా? దాన్ని ఆచరించి మీరు ప్రేమను పెంపొందించుకోండి. అదే సలాం. పరస్పరం సలాంను వ్యాపింపజేయండి. (అబూ హురైరా). ఇంకా ముస్లింల ఆరు విధుల గురించి తెలుపుతూ - "అతన్ని కలుసుకున్నప్పుడు సలాం చేయండి" అన్నారు. (మిష్కాత్)

సలాం గురించి ఇంకా ఇలా తెలిపారు -

"ముందుగా చేసేవాడు గర్వం లేనివాడు" ఇంకా ఇలా తెల్పబడింది. "అల్లాహ్ కారుణ్యానికి అత్యధిక అర్హతగలవాడు - సలాంను ముందు చేసేవాడు." (మిష్కాత్)

ప్రేమలోని బాధ్యత ఏమిటంటే వ్యక్తి తన తోటివాని కోసం ముందుగా దుఆ (ప్రార్థన) చేయాలి. ఈ విధంగా తన ఆనందాన్ని ప్రకటించాలి. దైవప్రవక్త ఎక్కడ వెళ్ళినా ముందు సలాం చేసి మాట్లాడేవారు. ఎవరితోనైనా స్త్రీ అయినా, పురుషుడైనా, పిల్లవాడైనా కూడా - ఇంకా పిల్లలకు సలాం చేయడంలో ముందుండెడివారు. సలాంను ఎక్కువగా వ్యాపించటానికి ప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు :

"మీలో ఎవరైనా పరస్పరం ఎదురైనప్పుడు సలాం చేసుకోవాలి. వారి మధ్య చెట్లు, గోడా, అడ్డం వచ్చి మళ్ళీ కలిసినా, మళ్ళీ సలాం చేయాలి." (అబూదావూద్, అబూ హురైరా)

ముఖ్యంగా ఇంటివారికి సలాం చేయాలని అనస్ (రజి)కు ఇలా ఆదేశించారు: “అబ్బాయి! నీవు ఇంటిలో ప్రవేశించేటప్పుడు సలాం చేయాలి. ఇది నీ కొరకు, నీ ఇంటివారి కొరకు శాంతి సౌభాగ్యం పెంపొందింపజేస్తుంది.”

ఒక వ్యక్తి తన తోటివాని కొరకు శాంతి (సలామత్) ప్రార్థన చేస్తే అతడు తన హృదయంలో ఎంతో ప్రేమను ఉంచుకున్న వాడవుతాడు. ఏవో రెండు వాక్యాలు అనుకుంటే దాని లక్ష్యాన్ని సాధించడం (ప్రేమను పెంచడం) అసాధ్యం.

## కరచాలనం

సలాం తర్వాత ప్రేమాభిమానాలను పెంపొందింపజేసే విషయాల్లో కరచాలనం ఒకటి. హజ్రత్ ఉమర్ (రజి)తో, 'ప్రవక్త (సఅసం) కాలంలో కరచాలనం చేయడం ఉండేదా?' అని అడిగితే దానికి ఆయన 'అవును' అని సమాధానమిచ్చారు. (మిష్కాత్, బుఖారీ) కరచాలనం సలాం పరిపూర్ణతను సాధించడంలో ఒక సాధనం. సలాం కరచాలనంతో పూర్తవుతుంది. దైవప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు : 'కరచాలనం ద్వారా సలాంలో పరిపూర్ణతను పొందండి.' (అహ్మద్, తిర్మిజి, మిష్కాత్). ఇంకా ఇలా సెలవియ్యడం జరిగింది : 'కరచాలనం ఆచరించండి. దానితో అసూయ దూరం అవుతుంది.' కరచాలనం వలన లాభాన్ని ఈ విధంగా తెలియజేశారు. ఇద్దరు ముస్లింలు కరచాలనం చేస్తే వారిద్దరు విడిపోకముందే వారిని క్షమించడం జరుగుతుంది. ఇంకో హదీసులో ఇలా ఉంది. 'కరచాలనం చేసి అల్లాహ్ స్తుతి చేస్తే ఇంకా క్షమాపణ కోరితే అల్లాహ్ వారిని క్షమించివేస్తాడు.' (అహ్మద్, తిర్మిజి, ఇబ్నెమాజ, అబూదావూద్)

## మంచిపేర్లతో జ్ఞాపకం చేయడం

ప్రతి వ్యక్తి తనను ఉత్తమోత్తమ పేర్లతో పిలవాలని కాంక్షిస్తాడు. మనిషి సహజ మనస్తత్వం ఇది. ఎంత ప్రేమైక స్వరంతో మాట్లాడితే అంతే ప్రేమ ఎదుటి వ్యక్తి హృదయంలో జనిస్తుంది. ఇందులో పిసినారితనం పనికి రాదు. ఇంకా తన సోదరుని ఏ విధంగా పిలిస్తే అతడు సతోషపడతాడో ఆ విధంగా పిలవాలి. సయ్యద్ అహ్మద్

షహీద్ (రహ్మలై) గారి ఉద్యమంలో ప్రతి వ్యక్తి తన సమానులతో, పెద్దలతో మాట్లాడేటప్పుడు వారి పేర్ల ముందు సోదరా! అనే పదాన్ని కలిపేవారు. చిన్నలను పిలిచినప్పుడు మాత్రమే పేర్లతో పిలిచేవారు. ఇలా పిలవటంలో ప్రేమ తొణికిసలాడాలి. దానితో ఎదుటి వ్యక్తి మనస్సు సంతోషపడాలి. తన సోదరుని మనస్సు గాయపడేలా పిలవడమనేది ప్రేమైక సంబంధాలలో పనికిరాదు. మృదుభాషణకు సంబంధించిన అన్ని హదీసులు దీనికి వర్తిస్తాయి. 'సోదరుని మంచి పేర్లతో పిలవండి' అని ఉమర్ (రజి) స్నేహం ఎలా పెంపొందింపజేసుకోవాలన్న విషయం గురించి చెపుతూ వివరించారు.

## వ్యక్తిగత విషయాలలో శ్రద్ధ

వ్యక్తి తన వ్యక్తిగత, స్వంత విషయాలలో ఏ విధంగా శ్రద్ధ కనబరుస్తాడో అదేవిధంగా తన తోటివాని విషయాలలో కూడా శ్రద్ధ చూపాలి. ప్రేమపూర్వక సంబంధాలలో ఇది అవసరం. పరస్పరం ఎప్పుడు కల్సుకున్నా తోటివాని మంచి చెబ్బరలు అడగాలి. అందులో పూర్తి మనస్సును లగ్నం చేయాలి. ఈ విధంగా ఒక రకంగా తోటివాని పట్ల తన మనస్సులోని శ్రేయోభిలాషను తెలియజేయవచ్చు. ప్రేమను ప్రకటించినట్లు కూడా అవుతుంది. ఈ విషయం సంబంధాలను పటిష్టపరుస్తుంది.

ప్రియప్రవక్త (సఅసం) తన సహచరులతో తోటివారి మంచి చెడ్డలు వాకబు చేయాలని చెబుతూ "ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తితో సోదర సంబంధాలు పెంచుకోవాలంటే అతడు ఆ వ్యక్తి పేరు, అతని తండ్రి పేరు, అతని వంశం పేరు అడగాలి. దీంతో పరస్పరం ప్రేమ పటిష్టంగా మారుతుంది" అన్నారు (తిర్మిజి, మిష్కాత్). వ్యక్తి పేరు మొదలైనవి మనిషి వ్యక్తిగత విషయాలలో భాగాలు. హదీసులో ఈ విధంగా ఒక మంచి విషయం తెలుపబడింది. సంబంధాలను పటిష్టం చేసే పద్ధతి తెలియజేయ బడింది.

## కానుకలు

తోటివానిలో ప్రేమ వాత్సల్యాలు పెంపొందింపజేయడంలో కానుకలు ఇవ్వడం

ఎంతో ముఖ్యమైనది. మంచి మాట పలకటం, మంచి పేరుతో పిలవడం, ప్రేమను వ్యక్తపరచడం అన్నవి నోటి (నాలుక) కానుకలు, వీటితో ఒకరికొకరు పరస్పరం దగ్గరవుతారు. తోటివాని హృదయం రంజిస్తుంది. ఇదేవిధంగా భౌతిక కానుకలు హృదయాలను కలుపుతాయి. ప్రేమను పెంచుతాయి. ప్రవక్త (సఅసం) వీటి ప్రాముఖ్యతను తెలుపుతూ అవి మనిషి హృదయాన్ని శుభ్రపరుస్తాయని అన్నారు. ప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు : "పరస్పరం కానుకలు ఇచ్చిపుచ్చుకుంటూ ఉండండి - వీటితో ప్రేమ పెంపొందుతుంది. హృదయాల శత్రుత్వం అసూయ నశిస్తాయి" (మిష్కాత్). ప్రవక్త మహనీయులు (సఅసం) స్వయంగా కానుకలు ఇచ్చేవారు. సహచరులు (రజి) కూడా దైవప్రవక్త (సఅసం) కు కానుకలు సమర్పించేవారు. కానుకల సమర్పణ సమయంలో ఈ క్రింది విషయాలు దృష్టిలో ఉంచుకోవాలి.

(1) కానుకలు మన సామర్థ్యాన్ని బట్టి ఇవ్వాలి. విలువైన వస్తువు ఇవ్వలేనని కానుక ఇవ్వటం మానుకోకూడదు. హృదయాలను కలిపేది కానుక విలువ కాదు, కానుక ఇచ్చే వానిలో ఉన్న చిత్తశుద్ధి.

(2) కానుక ఏదైనా కృతజ్ఞతా భావంతో స్వీకరించాలి.

(3) కానుకకు బదులు కానుక ఇచ్చే అలవాటు ఉండాలి. సమాన విలువైన కానుకలు ఉండనవసరం లేదు. తన స్థోమతను బట్టి ఇవ్వాలి. దైవప్రవక్త (సఅసం) ఎల్లప్పుడు కానుకకు బదులు కానుక ఇచ్చేవారు. ఒకసారి ఒక వ్యక్తి కానుకను నిరాకరిస్తే ప్రవక్త (సఅసం) తన నిరసనను తెల్పారు.

(4) కానుకలలో ప్రవక్త (సఅసం) కు చాలా పసందైన వస్తువు అత్తరు, నేటి రోజులలో పుస్తకం కూడా కానుకగా ఇవ్వవచ్చు.

## కృతజ్ఞతా భావం

ప్రేమైక భావాన్ని ప్రదర్శించే ఒక మంచి విషయం కృతజ్ఞతా భావం. ప్రేమతో చేసిన పనుల పట్ల తన తోటివాడు కృతజ్ఞత చూపుతాడన్న భావం సంబంధాలను

పటిష్టపరుస్తుంది. తన ప్రేమకు విలువ లేదన్న భావం మనిషిలో చోటు చేసుకుంటే బాధకు గురవుతాడు. అందువల్ల తోటివాడు మంచి మాటను పలికినా, లేదా కానుకలు ఇచ్చినా మనిషి అతని పట్ల ప్రేమను వ్యక్తపరుస్తూ కృతజ్ఞత తెల్పాలి. అతని ప్రేమ వాత్సల్యాల పట్ల హృదయపూర్వకంగా సంతోషం వ్యక్తపరచాలి. ప్రవక్త (సఅసం) గురించి సహచరులు ఇలా తెల్పారు.

"ఎవరైనా ప్రవక్త (సఅసం) సన్నిధిలో కానుకను సమర్పిస్తే, దానికి వారు (సఅసం) కృతజ్ఞత తెలిపేవారు. స్వీకరించేవారు. ఎవరైనా తన పనిని చేస్తే సంతృప్తిని వ్యక్తపరిచేవారు." (షిమాయిలె తిర్మిజి)

## కలిసి భుజించడం

కలసి భోజనం చేయడం - ఇతరులను భోజనానికి పిలవడం మొదలైనవి ప్రేమ సంబంధాలను పెంపొందింపజేసే ఆచరణాత్మక పనులు. ఇటువంటి సమయాలలో పరస్పరం నిస్సంకోచంగా మాట్లాడుకోవడానికి అవకాశం ఉంటుంది. ఇంకా భోజనమునకు వచ్చిన వ్యక్తి మనస్సులో తన తోటివాడు తన పట్ల ప్రేమాభిమానాలు కలిగి ఉన్నాడని భావిస్తాడు. ఈ విషయం సంబంధాలను పటిష్టపరచడానికి ఎంతో దోహదం చేస్తుంది.

ప్రవక్త (సఅసం) సహచరులు పరస్పరం విందులు ఇచ్చేవారు, ప్రియప్రవక్త (సఅసం) ను కూడా పిలిచెడివారు. ప్రవక్త (సఅసం) దగ్గర ఏవైనా తినే వస్తువులు ఉంటే లేదా ఎక్కడి నుండైనా వస్తే అందరితో పంచుకొనేవారు. కానుకలు ఇచ్చే విషయంలో వచ్చిన సూచనలను 'సహపంక్తి భోజనము' విషయంలో కూడా పాటించాలి. విందు నిరాడంబరంగా ఉంటేనే మంచిది. రోజూ మనం తినే ఆహార పదార్థాలే విందులో ఉంటే మంచిది. కొంత ప్రత్యేకత ఉంటే అది చాలా ప్రభావితం చేస్తుంది. విందుకు పిలిస్తే దానిని స్వీకరించాలి. పూర్తి సంతోషంతో మనస్ఫూర్తిగా అంగీకరించాలి. విందుకు బదులు విందు కోసం కృషి చేయాలి.

ముస్లింలు ఆరంభకాలంలో ఇంకొకరి ఇంట్లో భోజనం చేయడానికి

సంకోచించేవారు. దివ్య ఖుర్‌ఆన్ సూరె నూర్‌లో దీని గురించి ఆయత్‌లు అవతరించిన తర్వాత ఈ సంకోచం సమసిపోయినది.

# ప్రార్థన

దుఆ (ప్రార్థన) అనేది తనలో ఎన్నో హక్కులను బాధ్యతలను ఇముడ్చుకున్నది. ప్రత్యేకంగా దుఆతో వ్యక్తి తన ప్రభువు సన్నిధిలో తన తోటివాని గురించి కారుణ్యం, క్షమాపణలు కాంక్షిస్తాడు. అతని శ్రేయస్సును కోరుతాడు. అతని సంస్కరణకై ప్రార్థిస్తాడు. ఇంకా వ్యక్తుల లావాదేవీలు అల్లాహ్ చేతిలో ఉన్నాయని ప్రతి ముస్లిం విశ్వసిస్తాడు. తన గురించి తన తోటివాడు అల్లాహ్‌ను వేడుకున్నాడంటే అది ఆ మనిషి హృదయాన్ని ఎంతో ప్రభావితం చేస్తుంది. దుఆ ప్రత్యక్షంగా, పరోక్షంగా కూడా చేయబడుతుంది.

దుఆ యొక్క ఒక రూపం సలాం చేయడం, ఇందులో వ్యక్తి తన తోటివానిపై శాంతి, కారుణ్యం, సౌభాగ్యాలు గురించి దుఆ చేస్తాడు. ఒక ముస్లింపై ఇంకొక ముస్లింకు గల హక్కు ఏమిటంటే అతడు తుమ్మి 'అల్‌హమ్దులిల్లాహ్' (సర్వస్తోత్రములు అల్లాహ్‌కే) అని పలికితే దానికి ప్రతిగా అతనిపై కారుణ్యం యొక్క దుఆ 'యర్‌హముకల్లాహ్' అనాలి. ముస్లిం జనాజ కూడా ఒక హక్కు. ఇది కూడా ప్రార్థనలో ఒకటి. పరామర్శలో కూడా ప్రార్థన ఉంది.

వ్యక్తి ప్రార్థన చేసినా, లేదా ప్రార్థన చేయబడినప్పుడు అది సంబంధిత వ్యక్తికి తెలిసినా అతడు ఆ వ్యక్తి హృదయంలో తనపై ప్రేమాభిమానాలు ఉన్నాయని భావిస్తాడు. ఇద్దరిలో అల్లాహ్ కారుణ్యమే అంతిమ లక్ష్యంగా ఉంటుంది. తన తోటి వాడు ఆచరణాత్మకంగా తన మంచికి ప్రయత్నిస్తాడని అంతేకాక తన సమస్యలను సొంత సమస్యల వలే అల్లాహ్‌కు నివేదిస్తాడని భావిస్తాడు. తన దుఃఖ సమయంలో ఎలా విలపిస్తాడో, అదేవిధంగా తన దుఃఖ సమయంలో విలపిస్తూ అల్లాహ్ ముందు వేడుకుంటాడని భావిస్తాడు. సొంత తప్పులు పాపాలపై ఎలా క్షమాపణ వేడుకుంటాడో అదే విధంగా తన తప్పుల గురించి కూడా క్షమాపణను వేడుకుంటాడని భావిస్తాడు. తన గురించి ఏ విధంగానైతే కరుణా కటాక్షాలను ఆకాంక్షిస్తాడో అదేవిధంగా అతని గురించి కాంక్షిస్తాడని భావిస్తాడు. కేవలం ప్రభువే దిక్కు అయిన సమయంలో కూడా

తన తోటివాడు తన గురించి దుఆ చేస్తాడని భావించినప్పుడు అతని హృదయంలో ప్రేమ ఉప్పొంగుతుంది. ఈ విధంగా దుఆ ద్వారా ఇన్ని రకాలైన లాభాలు కలుగుతాయి. దుఆ చేసేటప్పుడు ఇతరులను కూడా అందులో భాగస్వాములు చేస్తే హృదయ పూర్వక సంబంధాలు బలపడుతాయి. సంబంధాలలో నైర్మల్యం ఏర్పడుతుంది. క్షమాగుణం, దయాగుణాలు చూపడం, అవసరాలకు ఆదుకోవడం, సమస్యలను దూరం చేయడానికి దుఆ చేయడంతో పాటు - తన తోటివాడు సత్యమార్గంపై స్థిరంగా ఉండాలని ప్రార్థించాలని, పరస్పరం ప్రేమ వాత్సల్యాలు కలిగి ఉండాలని బోధించబడింది. ఇదేవిధంగా హృదయంలో అయిష్టత, కల్మషం చెడులను దూరం చేయమని దేవుని ముందు విలపిస్తూ ప్రార్థన చేయాలి. 'ఓ ప్రభూ! మమ్మల్ని మాకు పూర్వం విశ్వసించిన సోదరులందరిని క్షమించు, మా హృదయాలలో విశ్వాసుల పట్ల ఎలాంటి కల్మషాన్ని మిగిల్చి ఉంచకు. మా ప్రభూ! నీవు చాలా కనికరించేవాడవు. కరుణామయుడవూ!'

ఒక సోదరుని పేరు తీసుకుని దుఆ చేస్తే అతనితో సంబంధం ఇంకా పటిష్టం అవుతుంది. తన సోదరుని క్షమాపణ కొరకు స్వచ్ఛందంగా ప్రార్థించడం, అతని ప్రేమాభిమానాలు లభించేలా చేయమని అల్లాహ్‌ను అర్థించడం, సంబంధాలు బెడిసి కొట్టకుండా చూడమని మొరపెట్టుకోవడం - ఇవి ఒక ముస్లిం బాధ్యతలు. తన గురించి ప్రార్థన చేయండని తోటివానిని కోరడం అనేది సంబంధాలలో ఎంతో ముఖ్యమైన విషయం.

దైవప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు : 'మీ సోదరుని వద్దకు పరామర్శకు వెళ్తే అతనితో మీ గురించి ప్రార్థన చేయమనండి. ఎందుకంటే అతని ప్రార్థన తొందరగా (అల్లాహ్ దగ్గర) స్వీకరించబడుతుంది.'

హజ్రత్ ఉమర్ (రజి) హజ్ యాత్రకు వెళ్ళే సందర్భంలో ప్రవక్త (సఅసం) కొన్ని వాక్యాలు పలికారు. వాటి గురించి తెలుపుతూ హజ్రత్ ఉమర్ (రజి) ఇలా అన్నారు -

'ఆ పదాలు నా పూర్తి జీవితంలో ఎంతో ఇష్టమైన పదాలు. ఆ పదాలు ఏమిటంటే, - ఓ సోదరా! నీ ప్రార్థనల్లో నన్ను కూడా జ్ఞాపకముంచుకో.'

## మంచిగా బదులీయడం

ఒక ముస్లిం ఎల్లప్పుడూ తన తోటివాని ప్రేమాభిమానాలకు ప్రతిగా మరింత ఎక్కువగా అతడిని ప్రేమించాలి. ఏకపక్షంగా ఏ సంబంధం కూడా మనజాలదు. తాను చూపే ప్రేమాభిమానాలు వృధా కాలేదని తోటివాడు కూడా భావిస్తాడు. తన ప్రేమకు బదులుగా మరింత ప్రేమ లభించిందని ఆనందిస్తాడు. సలాంకు ప్రతి సలాం ఉత్తమ రీతిలో చేయాలి. కానుకకు బదులు మంచి కానుకను ఇవ్వాలి. మంచి మాటకు సమాధానంగా ఇంకా మంచి మాటను పలకాలి. దైవప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు : "ఇద్దరు పరస్పరం ప్రేమించుకునే వారిలో తోటివాడిని ఎక్కువ ప్రేమించేవాడు ఎక్కువ శ్రేష్ఠుడు."

ప్రేమకు జవాబు ఎక్కువ ప్రేమతో సాధ్యం కానప్పుడు సమానంగానైనా ఉండాలి. మనిషి తన తప్పును ఒప్పుకున్నప్పుడు ఎదుటి వ్యక్తి చాలా ప్రభావితుడు అవుతాడు.

## ఇద్దరి మధ్య రాజీ కుదర్చడం - అపోహలను దూరం చేయడం

సంబంధాల పునాదిని పటిష్టం చేయడానికి ఈ అంశాలను దృష్టిలో ఉంచుకుని, సంబంధిత పద్ధతిని అవలంబించినట్లయితే సంబంధాలను రక్షించుకోవడమే కాక, మరింత దృఢంగా ఏర్పరచుకోవచ్చు. తోటివానిలో ఎన్నో తప్పులు, దోషాలు దొర్లవచ్చు. తప్పు చేయని మనిషి లేడు. అయినా సంబంధాలు కాపాడుకోవాలి. ఇస్లామీయ ఉ ద్యమానికి ఇవి ఎంతైనా అవసరం.

షైతాన్ కూడా ఈ మైదానంలో తన సైన్యముతో మన వెంబడే ఉంటాడు. పూర్తిగా సంబంధాలను బెడిసికొట్టేలా చేయడానికి, కలతలు పెంచడానికి ఎల్లవేళలా ప్రయత్నిస్తూ ఉంటాడు. సంబంధాలలో పైన తెల్పిన విషయాలను దృష్టిలో ఉంచుకుని వాటిని ఆచరిస్తూ ఎల్లప్పుడు తన సోదరునికి మానసికంగా గాని, శారీరకంగా గాని

కష్టం కలుగకుండా చూడాలి. మానసికంగా గాని, శారీరకంగా గాని కలిగిన కష్టం తీర్చడానికి పూర్తిగా సహాయపడాలి. ఆ సహాయం ప్రాపంచికమైనది, లేదా ధార్మికమైనది కావచ్చు. ఇంకా ప్రేమాభిమానాలను పూర్తిగా వ్యక్తపరచాలి. ఇతరుని ప్రేమకు దానికంటే మంచిగా, కనీసం అంతే ప్రేమతో జవాబు ఇవ్వాలి. తోటివాడిని గౌరవాభిమానాలతో చూస్తే షైతాన్ మధ్యలో తలదూర్చలేడు. అయినా సంబంధాలు చెడిపోయే పరిస్థితి ఏర్పడితే సులభంగా ఆ పరిస్థితిని చక్కదిద్దవచ్చు. సంబంధాలు చెడడానికి కారణం ఒక ముస్లిం హృదయంలో ఇంకో ముస్లిం గురించి ఏర్పడే అపోహలు. అపోహలకు ఎన్నో కారణాలుంటాయి. వాటిని దూరం చేయడానికి మార్గాలు సూచించబడ్డాయి. ఒక ముస్లిం ఇంకొక ముస్లింకు తన వాక్కర్మల ద్వారా కష్టం కలిగిస్తే ఫిర్యాదుకు అవకాశం ఉంది. ఇది ఒక కారణం. ఈ విషయం పెద్దది అయితే సంబంధాలు బెడిసికొడతాయి. చిన్నది అయినా చిన్న చిన్న విషయాలు ఒక పెద్ద సమస్యగా మారవచ్చు. అకారణంగా అనుమానించడం గురించి ఇంతకు ముందు చెప్పిన సూచనలు, మాటలు ఇక్కడ కూడా వర్తిస్తాయి.

ఒక ముస్లిం ఇంకొక ముస్లింకు ఫిర్యాదు చేసే అవకాశం ఇవ్వకూడదు. ఇతరుల హృదయాలు గాయపడకుండా జాగ్రత్తగా వ్యవహరించాలి. విశాల భావంతో ఒక ముస్లిం ఇంకొక ముస్లింను పలకరించాలి. ప్రవక్త (సఅసం) బోధించిన ఉత్తమ నైతిక బోధనలను దృష్టిలో ఉంచుకోవాలి. సాధ్యమైనంతవరకు అపోహలు తలెత్తకుండా చూడాలి. ఒకవేళ తలెత్తినా అవి సమసిపోయేలా చర్య తీసుకోవాలి. పై విషయాలలో జాగ్రత్తగా ఉన్నప్పటికీ అపోహ ఏర్పడితే దానిని మనస్సు నుండి వెంటనే తొలగించుకోవాలి. మరిచిపోవడానికి వీలు లేకుంటే ఆ విషయం చిన్నదైనా పెద్దదైనా దానిని తోటివాని ముందు వ్యక్తపరచాలి. తోటివాని గురించి మనస్సులో కల్మషం ఉంచుకోవడం, మలిన మనస్సుతోనే అతనిని కలవటం సరైనది కాదు. ఆలస్యం చేయకుండా మనస్సులోని మలినాన్ని శుభ్రపరచుకోవడానికి ప్రయత్నించాలి.

తన గురించి ఎవరయినా ఫిర్యాదు చేసినప్పుడు నుదురు చిట్లించకూడదు. అసహనం వ్యక్తపరచకూడదు. దాపరికం లేకుండా తన లోపాన్ని ఎత్తిచూపినందుకు అతనికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఎందుకంటే అతను సంబంధాలను పటిష్టపరచడానికి వెంటనే సంస్కరణకు పూనుకున్నాడు.

తమ తోటివాని మనస్సులో ఫిర్యాదు (అపోహ) ఉందని తెలిస్తే దానిని తొలగించడానికి వెంటనే పూనుకోవాలి. ఆలస్యమైన కొలదీ రోగం పెరుగుతూ పోతుంది. ఉపద్రవాన్ని ఎంత తొందరగా అణచివేస్తే అంత మంచిది. నిజంగానే తప్పు జరిగితే వెంటనే ఒప్పుకోవాలి. తన తప్పుకు బాధపడాలి. ఆ తప్పుకు కారణముంటే తెలపాలి. తప్పు జరగకుంటే అది కేవలం అపోహ మాత్రమే అయితే అపోహను తొలగించడానికి ప్రయత్నం చేయాలి. ఈ నేపథ్యంలో ఇంజీల్ గ్రంథంలో హజ్రత్ మసీహ్ (అ) పలుకులు గమనార్హమైనవి –

"నీవు ఖుర్బానీ స్థలంలో ఉన్నప్పుడు, ఖుర్బాని చేసేటప్పుడు కూడా తన తోటి వాడు తన గురించి అపోహ కలిగి ఉన్నాడని మనస్సులో అనిపిస్తే ఖుర్బాని అక్కడే వదలిపెట్టి తన సోదరుని కలుసుకోవాలి. అటు తర్వాతనే ఖుర్బానీ ఇవ్వాలి."

ఇది చాలా పెద్ద విషయం. తోటివాడు మీ పట్ల అపోహలతో ఉంటే మీరు సత్పురుషునిగా మారడం, అతనితో మంచి సంబంధాలు ఏర్పరచుకోవడం కష్టం. ఆరాధనలోని పూర్తి ఆశయం నెరవేరినప్పుడే అల్లాహ్ సంతోషిస్తాడు. అందువల్ల ఖుర్బానీ చేయడం కంటే ముందు తోటివానిని సంతోషపర్చడం ముఖ్యం. ఇందులో ఆలస్యం చేయరాదు. అలాగే ఒక ముస్లిం సోదరుడు తన తప్పును ఒప్పుకుంటే తోటివాడు అతన్ని క్షమించాలి. అది అతని బాధ్యత. ఇందులో వెనుకాడరాదు. అతడు తన అశక్తతను వెల్లడిస్తే ఒప్పుకోవాలి. ఇది కూడా అతని హక్కు. అపోహకు కారణం తెలిపితే దానిపై అతడు ఏమి అనక ఒప్పుకోవాలి. ప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు–

"ఒక ముస్లిం తన తప్పుకు కారణం తెల్పితే దానిని తోటివాడు ఒప్పుకోక అది తగు కారణం కాదని తలంచితే అతడు అక్రమంగా ధనం వసూలు చేసినంత పాపం మూట కట్టుకున్న వాడవుతాడు."

ఈ విషయాలను గమనించి, పటిష్ట సంబంధాల విలువను అర్థం చేసుకున్నప్పుడే ఆచరణలో సౌలభ్యం ఉంటుంది. మనిషి తన తోటివాని గురించి అతడి సంబంధాల విలువ గురించి తెలుసుకోవాలి. సంబంధాలను చెడగొట్టడం పాపకార్యంగా భావించాలి. ప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు – 'సంబంధాలను చెడగొట్టడం అనేది ఒక అస్త్రం, ఇది మొత్తం ధర్మాన్ని క్షవరం చేసే అస్త్రం. పరలోక

సాఫల్యమే అసలైన సాఫల్యంగా భావించే ప్రతి వ్యక్తి తన ధర్మానికి ప్రతి విషయంపై ప్రాధాన్యత ఇస్తాడు. ఇంకా ఎవరైతే ధర్మాన్ని రక్షించాలని కోరుకుంటాడో అతడు సంబంధాలను దెబ్బతినకుండా చూస్తాడు. ఇతరులతో అయిష్టంగా ఉండేవారు, సంబంధాలను చెడగొట్టుకునే వారిని ఇలా హెచ్చరించడం జరిగింది. ప్రవక్త (సఅసం) అన్నారు – 'మూడు రోజుల కంటే ఎక్కువగా తన సోదరునితో అయిష్టంగా ఉండటం ఏ ముస్లింకీ ధర్మసమ్మతం కాదు. కలిస్తే ఎడమొగం పెడమొగంగా ఉండటం కూడా ధర్మ సమ్మతం కాదు. వారిద్దరిలో సలాం చేసి ముందు మాట్లాడేవాడు శ్రేష్ఠుడు.' (బుఖారీ, ముస్లిం)

తగాదాలను పరిష్కరించుకోవడం గురించి ఇలా తెల్పబడింది. దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు : 'ప్రజల కర్మలు వారంలో రెండు రోజులు సోమవారం, గురువారం (ప్రభువు సన్నిధిలో) పెట్టబడతాయి. ప్రతి విశ్వాసి క్షమాభిక్షని పొందుతాడు. కాని తన తోటి ముస్లింతో విరోధం ఉన్న వానికి క్షమాభిక్ష లభించదు. వారిని కొన్నాళ్ళపాటు వారి మానాన వదలిపెట్టండి – బహుశా రాజీకి వస్తారేమో! అని అనబడుతుంది.' ఎవరైనా మూడు రోజుల వరకు సంబంధాలను తెగతెంపులు చేసుకుంటే వారి గురించి దైవప్రవక్త ఇలా అన్నారు : 'మూడు రోజుల వరకు మాట్లాడకుండా ఉండటం ఏ ముస్లింకైననూ ధర్మ సమ్మతం కాదు. మూడు రోజుల కంటే ఎక్కువగా ఇలాగే ఉండి ఒకవేళ ఆ సమయంలో మరణం సంభవిస్తే అతడు నరకంలో ప్రవేశిస్తాడు.' (అహ్మద్, అబూదావూద్, అబూహురైరా, మిష్కాత్)

సంవత్సరం వరకు మాట్లాడకుండా ఉంటే అది తోటివానిని చంపినంత పాపం. (అబూదావూద్, అబూ హురైరా కథనం). అయితే ఇందులో ఒక మినహాయింపు ఏమిటంటే వ్యక్తి సంబంధాన్ని సంస్కరించటానికి పూర్తిగా ప్రయత్నించి ఆ తర్వాత తెగత్రెంపులు జరిగితే తగాదాల్లో అతడు సత్యంపై ఉంటే, ఇలాంటి సందర్భాలలో అతనిపై నైతికంగా ధార్మికంగా ఎలాంటి తప్పు లేదు. కాని ఈ సందర్భంలో కూడా వ్యక్తి విశాల హృదయాన్ని ప్రదర్శించి తన సోదరుని క్షమించివేయాలి. సత్యంపై ఉండి కూడా తగాదాను మరిచిపోవాలి. శత్రుత్వం, ఘర్షణగా మారిపోవడం గురించి ప్రియప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "ఎవరైనా శత్రుత్వం తగాదాలను సత్య

ధర్మం కోసం విడిచిపెట్టినట్లయితే అతని కొరకు స్వర్గం మధ్య భాగంలో ఒక పెద్ద భవనం తయారు చేయబడుతుంది. ఇంకా తన ప్రవర్తనను మంచిగా చేసుకుంటే అతని కొరకు స్వర్గంలో ఉన్నత భవనం తయారు చేయబడుతుంది." (తిర్మిజి)

'క్షమించడం అనేది మంచి నడవడికలో ఉన్నత శిఖరం, దీనివలన వ్యక్తి స్వర్గంలో ఉన్నత స్థానాలను పొందేందుకు అర్హుడవుతాడు. తగాదాలను తీర్చే విషయమై ముస్లిం సమాజం సంబంధాలపై నిఘా వేసి ఉంచాలి. ఎక్కడ చెడు మొదలవుతుందో అక్కడ సంస్కరణకు పూనుకోవాలి. ఎందుకంటే వీటిపైనే సత్సంబంధాలు ఆధారపడి ఉంటాయి. ఈ సంబంధాలే సమాజానికి ఊపిరి. దివ్య ఖుర్‌ఆన్ ఈ విధంగా ఆదేశించింది.

**విశ్వాసులందరు పరస్పరం సోదరులు, ఇద్దరు సోదరులలో రాజీ కుదర్చండి, అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. (అల్ హుజురాత్ - 10)**

ఇంకా దౌర్జన్యం చేసేవాడిని ప్రతిఘటించాలని కూడా చెప్పబడింది. ప్రవక్త (సఅసం) తన సహచరులతో (రజి), "నమాజ్, రోజా, దానం యొక్క పుణ్యం కంటే ఎక్కువ పుణ్యం లభించే సత్కర్మలను నేను మీకు తెలుపనా?" అని ప్రశ్నించారు. దానికి 'ఓ ప్రవక్తా! (సఅసం) తెలుపండి' అని సహచరులన్నారు - దైవప్రవక్త ఇలా సెలవిచ్చారు : 'ప్రజల మధ్య సంబంధాలను చక్కదిద్దటం, సంబంధాలను చెడగొట్టడం ధర్మాన్ని నాశనం చేయడంతో సమానం.' (అబూదావూద్, తిర్మిజి)

అబద్ధాలకోరు ఇస్లాంలో అత్యంత నీచుడు అయినప్పటికీ ఇలా సెలవియ్యబడింది: 'ప్రజల మధ్య తగాదాలు తీర్చువాడు, మంచిమాట పలికేవాడు, మంచి మాట చేరవేసేవాడు అబద్ధాలకోరు కాలేడు.' (బుఖారీ, ముస్లిం)

అంటే ఒక వైపు నుండి ఇంకొక వైపునకు మంచి మాటను చేర్చువాడు (అందులో యదార్థం లేకున్నా) ఆ మాటలవల్ల సంస్కరణకు, అవకాశం ఉంటే అతడు అబద్ధాల కోరు కాదు. అయితే ఈ సందర్భంగా అబద్ధాలు లేకుండా చూడడం మంచిది. ఈ సూచనలను దృష్టిలో ఉంచుకుని ముస్లిం తనపై ఎవరికీ ఫిర్యాదు కలిగే అవకాశం లేకుండా వ్యవహరించాలి. సంస్కరణకు ప్రయత్నం చేస్తూ ఉండాలి. సమాజం కూడా అప్రమత్తంగా ఉంటే షైతాన్‌కు అవకాశం లభించదు.

# ముగింపు

సోదరభావం, ప్రేమ, స్నేహం, అనురాగాలతో కూడుకున్న సంబంధాలు విశ్వాసానికి ఒక తప్పనిసరి అవసరం. ఒకరి సుఖ దుఃఖాలు ఇంకొకరి సుఖదుఃఖాలుగా, ఒకరి కష్టం ఇంకొకరి కష్టంగా, ఒకరి సమస్య ఇంకొకరి సమస్యగా, ఒకరి సంతోషం ఇంకొకరి సంతోషంగా ఉన్నప్పుడే సంబంధాలు పటిష్టంగా, అత్యున్నతంగా ఉంటాయి. సంబంధాలలో దయాగుణం, ధార్మికత కూడా ఉంటే సంబంధాలు అన్ని కోణాలలో పరిపూర్ణంగా ఉంటాయి. ఈ సంబంధాలే ఒక సంస్థకు, ఒక ఉద్యమానికి ప్రాణం. ఉద్యమం సఫలం కావటానికి ఈ సంబంధాలే గ్యారంటీ ఇస్తాయి. దేవుడు మరియు దైవప్రవక్త ఇచ్చిన సూచనల ప్రకారం సత్సంబంధాల ఈ ఉన్నత వరాన్ని పొందటానికి సద్బుద్ధి కూడా అత్యవసరం. ఎందుకంటే సత్సంబంధాలు ప్రభువు యొక్క ప్రత్యేక కానుకలు. అందువల్ల సంబంధాలను పటిష్టపరచుకోవడానికి సంబంధాలు చెడకుండా చూసుకోవడానికి, సంబంధాలలో ప్రేమానురాగాలు పెంపొందించాలని అల్లాహ్‌ను వేడుకోవాలి.

**"ముస్లింల మనస్సులను ఒకదానితో ఒకటి కలిపినవాడు ఆయనే కదా! నీవు సమస్త భూసంపదను ఖర్చుపెట్టినా, వారి మనస్సులను కలపగలిగి ఉండేవాడివి కాదు. కాని అల్లాహ్ వారి మనస్సులను కలిపాడు."**

(అల్ అన్‌ఫాల్ - 63)

**"ఓ ప్రభూ! మమ్మల్ని, మాకు పూర్వం విశ్వసించిన మా సోదరులందరినీ క్షమించు, మా హృదయాలలో విశ్వాసుల పట్ల ఎలాంటి ద్వేషాన్ని కలిగించకు, మా ప్రభూ! నీవు చాలా కనికరించేవాడవు, కరుణామయుడవూను."** (హష్ర్ - 10)

-ః సమాప్తం ః-